# ధమ్మపదం



జె.యస్. రఘుపతిరావు

# ధమ్మపదం

తెలుగుపదరచయిత :

**జె.యస్. రఘుపతిరావు**

*15-79, పద్మావతి నగర్, తిరుపతి.*

ప్రకాశకులు :

జనశ్రుతి పబ్లికేషన్స్ (నెం.7), తిరుపతి.

ప్రతులకు :

యస్. కె. గార్గి, ఆత్మారామాశ్రమం,

గౌతమీనగర్, కొవ్వూరు, ప.గో. జిల్లా.

**2004** **రూ. 40/-**

# విషయానుక్రమణి



డి.టి.పి. - శ్రీ అసంగానంద గ్రాఫిక్స్, శ్రీ వ్యాసాశ్రమము.

ముద్రణ - శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు.

# బుద్ధుడు

## 1. బుద్ధుని జీవిత వృత్తాంతం

బుద్ధుడు క్రీ. పూ. 563 వ సంవత్సరంలో పుట్టాడు. శాక్యరాజైన శుద్ధోధనునికి మాయాదేవికి పుట్టాడు. లుంబినీవనం (ప్రస్తుతం నేపాల్) లో పుట్టాడు. తల్లి చనిపోవడం వల్ల పినతల్లి ప్రజాపతి గౌతమి పెంచింది. అందుచే సిద్ధార్థుడు గౌతమబుద్ధుడయ్యాడు. వైశాఖ పూర్ణిమనాడు పుట్టాడు. వైశాఖ పూర్ణిమనాడు మహాభినిష్క్రమణ (ఇల్లువదలడం), జ్ఞానోదయం, నిర్వాణం మున్నగు ప్రధాన సంఘటనలు జరిగాయి. అందుచే అది మహావైశాఖి అనబడింది.

బుద్ధుడు దయగలవాడు, నెమ్మదైనవాడు, ధ్యాన మయుడు, ధార్మికుడు, దుఃఖ నివారకుడు, శీలసంపన్నుడు; ప్రజ్ఞతోజీవించాడు, మానవాళిని ప్రేమించాడు, తాను వెలుగైనాడు, లోకానికి వెలుగు నిచ్చాడు. తాను దేవుడు కాదు, గంధర్వుడుకాదు, యక్షుడుకాదు, మానవుడుకాదు, బుద్ధుడే. ఎలాంటి వివక్ష, విభేదం, తారతమ్యం లేని సమ్యక్ సంబుద్ధితో "ధర్మచక్రప్రవర్తన" జేశాడు. కాలి నడకన తిరిగి, పాళిభాషలో బోధసల్పాడు. భిక్షుసంఘ నిర్మాణం జేశాడు. భిక్షతో ఒంటిపూట భుజించాడు. బుద్ధుడు అందమైనవాడు, ఆకర్షణగలవాడు, ఆజానుబాహుడు, 32 మహాపురుషలక్షణాలు గలవాడు. అతని నోట మాధుర్యముంది, మనసున మహాజ్ఞాన ముంది. బుద్ధుడు 80 ఏళ్లుజీవించాడు. వైశాలిసమీపాన కుషీనార్‌లో దేహం విడిచాడు. అది 'మహాపరినిర్వాణం'. అట్టి బుద్ధుడు మానవాళికి శరణ్యం.

"కరుణామయుడగు బుద్ధుని
కరుణ శ్రీవాణి విశ్వకళ్యాణగుణా
కరమై ఆ చంద్ర దివా
కరమై వెలుగొందు దిగ్దిగంతములందున్."

## బుద్ధుని ప్రత్యేకతలు

1. బుద్ధుడు మార్గదాత మాత్రమే
2. బుద్ధుడు మోక్షదాత కాదు.
3. బుద్ధుడు దివ్యత్వాన్ని ఆపాదించుకోలేదు.
4. దేవుడుకాదు, దేవుని అవతారంకాదు, దేవుని కుమారుడు కాదు.
5. బుద్ధుడు అందరిని మించినవాడు; మానవుడుగాపుట్టి బుద్ధుడైనాడు.
6. బహుజన హితాయ, బహుజన సుఖాయ.

## బుద్ధుని సిద్ధాంతాలు

1. ఏదీ శాశ్వతం కాదు - అశాశ్వతం
2. ఏదీ స్థిరం కాదు - అనిశ్చితం
3. ఆత్మ లేదు - అనత్త (నైరాత్మ్యం)
4. అవ్యాకృతాలు గుర్తించుట - అనర్థం
5. చతురార్యసత్యాలు వ్యాకృతాలని గుర్తించాలి
   (1) దుఃఖస్వరూపం (2) దుఃఖకారణం
   (3) దుఃఖనివారణ (4) దుఃఖ నివారణోపాయం.
6. ప్రతీత్య సముత్పాదం
7. ప్రత్యక్షం ప్రమాణం
8. మానవుడు మూలం, మానవుడు కేంద్రం, మానవసంబంధం ఉత్కృష్టం.
9. నిర్వాణం, పరినిర్వాణం, మహాపరినిర్వాణం
10. మానవుడు బుద్ధుడు కావడం బౌద్ధ మార్గం

**1) పంచశీల:-** శుద్ధపదం-పవిత్రమార్గం

చంపరాదు, దొంగిలించరాదు, అబద్ధమాడరాదు, వ్యభిచారం చేయరాదు, మత్తు పదార్థాలు సేవించరాదు.

**2)** అష్టాంగం:- ధర్మపథం - న్యాయమార్గం (మధ్యేమార్గం)- దుఃఖ నిరోధగామినీ ప్రతిపదమార్గం. అనగా

సమ్యక్ వాక్కు, సమ్యక్ కర్మ, సమ్యక్ జీవనం- ఇవి మూడున్ను శీలం.
సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ కృషి- ఇవి మూడున్ను ప్రజ్ఞ.
సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి- ఇవి రెండున్ను సమాధి.

**3)** ప్రజ్ఞాపారమిత:- అనగా ఉత్తమగుణాలు-శీలపథం-నీతిమార్గం. శీలం, దానం, ఉపేక్ష, నిష్కామం, వీర్యం, కాంతి, సత్యం, ధ్యేయనిశ్చయం, కరుణ, మైత్రి అను పదిపారమితలను ప్రజ్ఞతో ఆచరించాలి. అంటే ప్రజ్ఞాశీలం, ప్రజ్ఞాదానం మొదలగునవి బంధవిముక్తి, శాంతి, నిర్వాణం కల్గిస్తాయి.

## బుద్ధుని ధమ్మ

1) జీవితంలో పవిత్రమైంది
2) పరిపూర్ణమైంది
3) నిబ్బణంలో బ్రతకడం
4) తృష్ణను వదలడం
5) సముదాయాలు అసంపూర్ణములని తెలియడం
6) నైతిక విధానానికి కర్మకారణమని గ్రహించడం
7) దుఃఖానికి కారణాలు భయం, ఆశ, ద్వేషం, క్రోధం అని తెలియడం.

## ధర్మంకానిది - ధర్మం పేరుతో చలామణిఅయ్యేది

1) అతీతశక్తులపై ఆధారపడడం
2) దైవనమ్మకం (అవసరంలేంది)
3) బ్రహ్మైక్యం (అబద్ధ ధర్మం)
4) ఆత్మలో నమ్మకం
5) యజ్ఞయాగాదులలో నమ్మకం

6) ఊహల్లో నమ్మకం
7) ధర్మశాస్త్రాల్లో నమ్మకం- వాటిని పుణ్యమని చదవడం
8) శాస్త్రాలు దోషరహితాలు, అపౌరుషేయాలు అనడం
9) వర్ణ వివక్షలు పాటించడం, అవి దైవ సృష్టియనినమ్మడం

## ధమ్మం సద్ధమ్మం కావాలంటే

1) మనసులోని మాలిన్యాలను ప్రక్షాళన చేయడం
2) ప్రజ్ఞను పెంపొందించడం, దాన్ని అందుబాటులోకి తేవడం
3) ప్రజ్ఞ చాలదని శీలంతోడు జేయడం
4) ప్రజ్ఞాశీలాలకు తోడు కరుణ ఆవశ్యకమని గుర్తించడం
5) ప్రజ్ఞ-శీల-కరుణలకు మైత్రి చేర్చాలని తెలియడం.
6) మనిషికి మనిషికి మధ్య అడ్డుగోడలు కూల్చడం
7) పుట్టుకను బట్టిగాక ప్రతిభనుబట్టి మనిషి విశిష్టతను గుర్తించి, గౌరవించడం
8) స్త్రీపురుష సమానతను బోధించడం, పాటించడం
9) మనిషికి మనిషికి మధ్య సమత్వం, సోదరత్వం నిల్పడం

## బౌద్ధంలో మరికొన్ని విశేషాలు

1) ధర్మాచరణ ప్రధానం - జీవితంలో ఆత్మస్థైర్యం ఉంటుంది.
2) మైత్రికి తెలివిని జోడించమంటుంది - సమర్థత సంప్రీతిగా ఉంటుంది
3) సహేతుకంగా ఉండటం - సైన్సు, నాగరికత వృద్ధి చెందుతాయి.
4) సమానత్వం ప్రాతిపదిక - మానవులుసమానులైతే వివక్షలేదు
5) గణతంత్రవిధానం ఉంది- ప్రజాస్వామ్యానికి అనుగుణమైంది
6) మతాచారకర్మకాండలులేవు - బాహ్యాధికారం కన్నా నైతికతమిన్న
7) స్వయంశిక్షణ, స్వశక్తిపై ఆధారం - స్తుతి, ప్రార్థన, పూజాదులబెడదలేదు
8) హింస, దోపిడి, దౌర్జన్యాలు లేవు - యుద్ధాలు, ఉగ్రవాదా లుండవు

9) అన్నీ అనిత్యమనుట అంతర్‌దృష్టి - అణువుబ్రద్దలవుతోంది, అహంచెదిరిపోతుంది.

10) మనసే ప్రధానం - బౌద్ధం ప్రవర్తనలో మార్పుతెచ్చే మానవ శాస్త్రమైంది.

11) జ్ఞానోదయం విలువైంది - నమ్మకంతోపనిలేకుండా అజ్ఞానం యొక్క దుస్థితి తెలుస్తుంది.

12) 'ధమ్మ' (ధర్మం) సకల మానవాళిది - అన్నిమతాల వారూ ధర్మాన్ని సొంతం చేసుకున్నారు, బౌద్ధాన్ని మతంగానేగాక ధర్మంగా ఆచరించవచ్చు. హిందువును గీరితే బుద్ధుడు కనిపిస్తాడు (CF Andrues)

13) వృద్ధికి, వికాసానికి తావుంది - సంపూర్ణతకు, సమగ్రతకు వీలైంది.

14) మంచి చెడులు ముఖ్యం - అంతకుమించినవి కావు, పుణ్య పాపాలు తెలియనివి.

15) భిక్షు సంఘ నిర్మాణం - ఆర్థిక ధార్మిక మానవ సూత్రాలు ప్రకటితమైనాయి.

16) మధ్యే మార్గం -మానవులకు అందు బాటైంది.

17) అర్హత్వం - నిత్యజాగృతి నిద్రలో కూడ; ఆత్మవిశ్వాసం, శక్తి, స్మృతి, ఏకాగ్రత, ప్రజ్ఞ కలిగి ఉండడం

18) ధర్మం సర్వసామాన్యం - మతాతీత మానవతాసమాజానికి మార్గం.

19) సత్యజ్ఞానం లభించేవిధం - స్వయం పరిశీలనద్వారా నిష్పాక్షికంగా, స్వచ్ఛందంగా, సూక్ష్మంగా లభిస్తుంది, అది గుణంగలది, దోషం లేనిది; సుఖదాయకమ్మైంది, విలువైంది, మానవశుభప్రదమైందిగా వుండాలి.అంటే కేవలం, విన్నది, సంప్రదాయబద్ధమైంది, గతంలో చెప్పింది, శాస్త్రంలో ఉన్నది, చర్చలో తేలింది, తర్కబద్ధమైంది, కనపడ్డరూపాలకు వివరాలకు కట్టుబడింది, అందరికీ అంగీకృతమైంది, సరైందిగాకనపడింది, సన్యాసి చెప్పింది, దైవం చెప్పించి, భయపెట్టేది, ఆలోచనాత్మకమైంది, అనుకూలమైంది, మొహమాటమైంది, ప్రత్యామ్నాయంలేంది,

ఆదర్శప్రాయమైంది అని దేన్నీ గ్రహించరాదు.

20) బౌద్ధ సారం - చెడుచేయొద్దు, మేలు చేయి, చిత్తాన్ని పరిశుద్ధం జేసుకో; ఇదే బౌద్ధశాసనం.

## నేడు బౌద్ధం అవసరమైంది

### A. సమన్వయం

1) సామాజిక మైంది
2) సత్ సంబంధం నిలిపేది
3) ప్రభుత్వానికి ఉపయోగపడేది
4) మెజిస్ట్రేట్ ద్వారా ధర్మం నెరవేరుతుంది-అదేన్యాయం
5) మానవ సంబంధమేగాని దైవసంబంధం కాదు
6) వాస్తవం మీద ఆధారపడింది.
7) సహేతుకం, శాస్త్ర విజ్ఞాన సహితం.

### B. వినియోగం

1) మనుషులకు, జాతికి వేరువేరైందికాదు
2) కుల-వర్గ సంబంధం కాదు
3) ఊహాత్మకం కాదు
4) విడ దీసేది కాదు
5) శాస్త్ర విరుద్ధం కాదు
6) స్వధర్మం - పరధర్మం అని లేదు
7) సంకుచితం, పరిమితం కాదు
8) ఆచరణ యోగ్యమైంది.

# మతం - ధర్మం

1) మతం దేవుని పైన, ధర్మం 'నీతి' పైన ఆధారపడింది.
2) మతానికి నమ్మకం ముఖ్యం, ధర్మానికి హేతువు ముఖ్యం
3) మతం వ్యక్తిగతమైంది. ధర్మంసామాజికమైంది
4) మతానికి ఆరాధన, ధర్మానికి ఆచరణ ఉంటాయి.
5) మతానికి సిద్ధాంతముంటే, ధర్మానికి సువిచారణ ఉంటుంది.
6) మతానిదిదైవ సంబంధం. ధర్మానిది మానవ సంబంధం
7) మతంలో మధ్యవర్తులుంటారు, ధర్మానికి లేరు
8) మతంలో సృష్టి కర్త ఉంటాడు. ధర్మానికి దైవం అనావశ్యకం.
9) మతంలో ఆత్మతత్వముంది. ధర్మానికి ఆత్మతో పనిలేదు.
10) మతం వ్యవస్థీకృతమై అన్నిరంగాలలో జోక్యం చేసుకొంటుంది, ఆధిపత్యం వహిస్తుంది, అస్తవ్యస్తం చేస్తుంది. ధర్మం వ్యవస్థీకృతం కాదు. సంప్రదాయ బద్ధం కాదు. యాంత్రికంగా గాక సజీవంగా ఉంటేనే ధర్మం.
11) మతంవర్ణాశ్రమాలతో, శాఖావిభజనలతో, వివక్షతో కూడి ఉంటుంది. ధర్మం సామాన్యంగా, సార్వజనీనంగా ఉంటుంది.
12) మతంలో ఉన్నలోపం ధర్మానికి తెలుస్తుంది. ధర్మంలో ఉన్న లోపం ఆచరణలో తెలుస్తుంది.
13) మతవిశ్వాసం ఆదినుంచి క్రమంగా మారుతూ వచ్చింది. నిర్వచనాలు మారాయి. ధర్మం వ్యష్టి-సమష్టి సత్సంబంధాలకూ, వికాసానికి నుగొనబడింది.
14) పరిపాలనలో మతం తగదు, ధర్మంకావాలి.
15) మతంలో అతీతశక్తి వుంటుంది. ధర్మంలో స్వశక్తి మాత్రమే.
16) బౌద్ధం మహాయానమైనాక, మతం లాగ కొంత గందరగోళంలో పడింది.

# బౌద్ధవాఙ్మయం

## త్రిపిటకాలు

ఆది బౌద్ధవాఙ్మయం త్రిపిటకాలలో నిక్షిప్తమై ఉంది. పిటక మంటే గంప. వస్తువులను చేర్చుకొని అందించేది. జ్ఞానాన్ని భావితరాలకు అందించేది. బుద్ధుని నిర్వాణం తర్వాత రాజగృహలో ధర్మసూత్రక్రోడీకరణ సభ జరిగింది. అది మొదటి సంగీతి. మహాకశ్యపుడు అధ్యక్షత వహించాడు. ఉపాలి, ఆనంద భిక్షువులు సాయపడ్డారు. అపుడు ధర్మసూత్రాలు, రెండు పిటకాలుగ ఏర్పడ్డాయి; వినయ పిటక, సుత్త పిటక.

ఒక శతాబ్దం తర్వాత వైశాలిలో రెండవ సంగీతి జరిగింది. అశోకుని కాలంలోను, కనిష్కుని కాలంలోను 3వ, 4వ సంగీతిలు జరిగాయి. ఆ సంగీతిల్లో మూడవ పుస్తకమైన అభిధమ్మ పిటక పూర్తి చేయబడింది. ఇది రెండవ (సుత్త) పుస్తకాన్ని అనుసరించి తయారు చేయబడింది.

## వినయ పిటకము

వినయ అంటే క్రమశిక్షణ. భిక్షు సంఘ సభ్యులు పాటించవలసిన నియమ నిబంధనలు. వినయపిటకలో 'ప్రాతిమోక్ష' అనేది ఒక ముఖ్య విభాగం. నిత్యజీవితంలో ఎలాంటి దోషాలకు పాల్పడే అవకాశం ఉందో వివరిస్తుంది. పున్నమి అమావాస్య దినాలలో దీనిని చదివి, తమ తప్పులు అంగీకరించి, సరి చేసుకొనేవారు. దీనిపై అతిప్రాచీన వ్యాఖ్యానంకూడ ఉంది. అది సుత్త విభాగం. ఈపిటకంలో మహావగ్గ, చుల్లవగ్గ అనే రెండు ఖండాలున్నాయి. మహావగ్గలో సంఘ సభ్యత్వానికి సంబంధించిన నిబంధనలు, ఉపవాసదినాలు, సందర్భానుసారమైన వివరణలు, కొన్ని జీవితాంశాలు ఉన్నాయి. చుల్లవగ్గలో ఇంచుమించు మహావగ్గలో నున్న విషయాలేగాక ప్రాచీనభారతసామాజిక పరిస్థితి గూర్చి కూడ ఉంది.

## సుత్తపిటకము

సుత్తఅంటే సూత్రం లేక దారం. సుత్తఅంటే ఏదో ఒక విషయాన్నో అంశాన్నో మాత్రం ప్రస్తావించే ఒక చిన్న పద్యం అని కూడ అర్థం. సుత్తపిటకలో బుద్ధుని ఉపదేశాలు, సంభాషణాలు ఉంటాయి. అయిదు సంపుటాలుగా విభక్తమైంది. అవి దీఘ నికాయ, మజ్జిమ నికాయ, సంయుత్త నికాయ, అంగుత్తార నికాయ, బుద్ధక నికాయ. మొదటినాలుగు గద్యరూపంలో బుద్ధుని లేక శిష్యుల సంభాషణాలు.5వది పద్యరూపం, అనుబంధవిషయాలు.

దీఘనికాయం-సుదీర్ఘ సంభాషణాలు
మజ్జిమ నికాయం-మధ్యరకం సంభాషణాలు
సంయుత్త నికాయం - ఒక విషయం లేక ఒక వ్యక్తి గూర్చి.
అంగుత్తార నికాయం - సంఖ్యాపరంగా విషయాలు చెప్పబడ్డాయి. 1 నుంచి 11 వరకు.

ఉదా:- త్రికరణాలు-మనసు, వాక్కు, కర్మ అలాగే కామ, క్రోధ, లోభ.

సంయుత్త, అంగుత్తారలలో తథాగతుని ప్రవచనాలున్నాయి.

బుద్ధక నికాయం- 15 గ్రంథాలు; పద్యాలు, చిన్నగేయాలు, ద్విపదలు ఉన్నాయి. ఇందులో 423 గాథలతోను 550జాతక కథలతోను 'ధమ్మపద' ఉంది.

నాగసేనుడు వ్రాసిన మిలిందపన్హ గ్రంథం కూడ ఆదిమ బౌద్ధానికి సాధికారికమైంది.

## అభిదమ్మ పిటకము

సుత్త పిటకంలోని మాతృకల నుండి గ్రహించిన తాత్విక భావాలతో అభిదమ్మ పిటకం ఏర్పడింది. 'అభి' అంటే శ్రేష్టమైంది. బుద్ధుడు దేవతలకు వినిపించిన బోధనలు,తాత్విక నైతిక అంశాలు, అన్యోన్యసంబంధాలు ఇందులో ఉన్నాయి.

బుద్ధుని బోధలు పాళి లాగ ఉండే మాగధీభాషలో కూడ ఉన్నాయి. పాళిఅంటే

పంక్తి. పాళిని దక్షిణాదులు మాగధి అన్నారు. వాటిని ఛందస్సులో బంధించడానికిగాని సంస్కృతీకరించడానికి గాని బుద్ధుడు అంగీకరించలేదు. అలా చేయడం నేరంగా పరిగణిస్తానని హెచ్చరించాడు. జనం నిత్యం మాట్లాడే భాషలోనే తన ప్రవచనాలు అధ్యయనం చేయాలని ఆదేశించాడు. రాజ్యాలు మారాక పాళీ పూర్తిగా కను మరుగైంది. బర్మా, సిలోన్, ఇండోనేసియా, మలేసియా ప్రాంతాలలో పాళి, మత పరంగా నిలిచి ఉంది.

## బౌద్ధం వ్యాప్తి

బుద్ధుడు ఇంచుమించు ఉత్తరదేశమంతా తిరిగాడు. మొత్తం పాదచారిగా సంచరించాడు. శాక్య, కురు, అంగదేశాల్లో ప్రబోధించాడు. లుంబినీరాజగృహల మధ్య 250మైళ్లు కాలినడకతోనే ప్రయాణం చేశాడు. చెట్ల నీడనే ఉంటూ బోధించాడు. కొన్ని సమయాల్లో గ్రామగ్రామంలో తిరిగాడు. నదిక, నలంద, అప్పన, ఓపసర, కుషినార, దేవదాహ - లెక్కకుమించిన ప్రదేశాల్లో ప్రబోధించాడు. శ్రావస్తికి 75 సార్లు, రాజగృహకు 24 సార్లు, కపిలవస్తుకు 6సార్లు, వైశాలికి 6 సార్లు, కామ సద్ధర్మకు 4 సార్లు తిరిగి ప్రవచించాడు. భిక్షువులు చాలా ప్రదేశాలు తిరుగుతూ ప్రచారం చేశారు. శిష్యుల ప్రబోధాల్లో అనుమానాలు వచ్చినా, వైరుధ్యాలున్నా బుద్ధుడే సందేహాలు తీర్చేవాడు. బుద్ధుని తర్వాత బౌద్ధ ధర్మం ఆసియా దేశాలన్నిటా వ్యాపించింది. చక్రవర్తులనే గాక జనమానసాలను కదిలించింది. బుద్ధుని మహోన్నత వ్యక్తిత్వం భారతీయుల హృదయాలపై చెరగని ముద్రవేసింది. బుద్ధుని బోధనలు సకలవైదిక అవైదిక తత్వ శాఖలన్నిటిని మిక్కిలి ఎక్కువగా ప్రభావితం చేశాయి. బౌద్ధధర్మ వ్యాప్తి భారతీయ కళలను, సంస్కృతిని ఎంతగానో మార్చేసింది. బౌద్ధసాహిత్యాన్ని అశ్వఘోషుడు, ధర్మ కీర్తి, మహాకచ్చాయ మున్నగు మహోన్నత బౌద్ధ పండితులు వ్యాప్తి జేశారు. ఇంకా ఆర్యదేవుడు, శాంతిదేవుడు, మైత్రేయుడు, అసంగుడు, వసుబంధు, జినదేవుడు, దిజ్ఞాగా చార్యుడు, సంఘనంది, బ్రహ్మదత్తుడు, విమలబుద్ధి బౌద్ధగ్రంధరచనా విస్తరణకు పాటుపడ్డారు.

## ఆంధ్రలో బౌద్ధం

ఆంధ్రదేశంలో బౌద్ధధర్మబీజం వేయడానికి సంకల్పించింది అశోకుడు. ఈబాధ్యతను అతడు మహారేవతో తేర అనే భిక్షువుకు అప్ప జెప్పాడు. అతడు మగధ మహాసాంఘిక నాయకుడైన మహాదేవ భిక్షువనే నామాంతరంగలవాడని తెలుస్తున్నది. అతడు కృష్ణాజిల్లా ధాన్యకటక-ధరణికోట-కువచ్చాడు. ఆంధ్ర (అంధక)దేశంలో చైత్యకవాదం-చైత్యకనికాయం-ప్రవేశపెట్టాడు. అమరావతి, ఘంటసాల, నాగార్జున సాగర్, భట్టిప్రోలు, అనకాపల్లి బొర్రాగుహలు, శ్రీకాకుళం జిల్లా మున్నగు ప్రాంతాలలో బౌద్ధం బాగా వ్యాపించినట్లు చరిత్ర ఆధారాలున్నాయి. ప్రస్తుతమున్న అనేక హిందూదేవాలయాలకు బౌద్ధవిగ్రహాలు లేక బౌద్ధస్తూపాలు మూలమని పరిశోధనల్లో తేలుతున్నది.మహాయాన-మాధ్యమిక- తత్వశిరోమణి ఆచార్యనాగార్జునుడు ఆంధ్రదేశమునకు చెందిన వాడని ప్రతీతి. అట్లే ఆచార్య బుద్ధ ఘోషుడు కూడ ఈ ప్రాంతమువాడే. ఇంకా మహామహు లెందరో ఉన్నారు. వారు ఈ ప్రదేశంలో బౌద్ధమును సువ్యాప్తం జేశారు. ఇపుడు సికింద్రాబాద్‌లో వెలసిన ఆనంద బుద్ధ విహార్ ట్రస్టు వారు థాయ్‌లాండ్ సహాయంతో బౌద్ధసాహిత్య వ్యాప్తికి పూనుకొన్నారు. అంతేగాక సికింద్రాబాద్‌లో మహేంద్రగిరిపై పదికోట్ల రూప్యముల బౌద్ధ ప్రాజెక్టు చెన్నూరి ఆంజనేయరెడ్డి అధ్వర్యంలో నిర్మాణ మవుతోంది.

## ధమ్మపదం

సుత్తపిటకంలో బుద్ధక నికాయంలో ఉన్న 15 గ్రంథాలలో 'ధమ్మపద' మిక్కిలి ప్రధానమైంది. అందులో 26 అధ్యాయాలు, 423 గాథలు ఉన్నాయి. 'ధమ్మపద' గాథా సంకలనం క్రీ. పూ. 5,వ శతాబ్దిలో పూర్తి అయినట్లుంది. ఈగ్రంథం ప్రపంచ ప్రసిద్ధిచెందింది. 1855లో డా. ఫాస్ బాల్ (Dr. Faus Boll) దీన్ని లాటిన్ భాషలోకి అనువదించారు. తర్వాత దాదావు పాశ్చాత్య భాషలన్నిటిలోకి భాషాంతరీకరణ చెందింది. ప్రస్తుతం ప్రపంచంలో అన్ని ప్రధానగ్రంథాలయాల్లో దొరుకుతుంది.

గాథ అంటే పద్యం. పదమంటే మాట. పదంతో లేక పదాలతో కూడిన పద్యం గాథ. 8 వ అధ్యాయం 2,3 పద్యాలలో గాథ, పదం అనే శబ్దాలు వాడారు. గాథ అంటే పద్యం లేక పాట అని అర్థం. పదం అంటే శబ్దం లేక మాట అని అర్థం. 18-20లో కూడ 'పదం' వాడబడింది. 'పదం' అంటే చిహ్నం, జాడ, మార్గం, స్థానం (Position) అని అర్థాలు చెప్పారు. ధమ్మపద అంటే ధర్మగీతం లేక ధర్మమార్గం అని అర్థం చేసుకోవచ్చు. ప్రతి గాథ వెనుక ఒక కథ ఉంది. ఒక్కొక్క కథలో ఒక సందర్భం, ఒక స్థలం, ఒక వ్యక్తి లేక భిక్షుసంఘం ఉంటాయి. ఆయా వివరాలు ఇంచు మించు ప్రతిగాథకు సూచించబడినాయి. వేరు వేరు చోట్ల వేరు వేరు సందర్భాల్లో వేరువేరు మనుషులకు బోధించడం జరిగింది. వాటన్నిటిని పిటక విభాజకులు ఒక్క చోట జేర్చి 'ధమ్మపద' పుస్తకంగా సంపుటీకరించారు. అన్నీ బుద్ధుని జీవితంలోని సంఘటనలే. ఇవి మానవాళికి సుఖశాంతులు కల్గించే నిమిత్తం కరుణాస్పదంగా చేసిన గంభీరబోధనలు. ఇందులోని కవిత్వం రసార్ద్రంగానూ, ఉపమానోపమేయం గానూ, సౌందర్య సౌష్ఠవంగానూ, జ్ఞాన విజ్ఞాన యుతంగానూ, మకరందజల్లు గానూ, హృదయ స్పందనంగానూ, వాస్తవిక తత్వంగానూ, నిత్యజీవితవిషయం గానూ ఉంది. ప్రశాంత పవిత్ర భావనలు ప్రతి పదంలోనూ ఉట్టి పడుతుంటాయి. ఇదొక ధార్మిక మహా కావ్యం.

'ధమ్మపద'కు అనేక తెలుగు తర్జుమాలున్నా, నేను సూటిగా, ఉన్నదున్నట్లు అర్థమయ్యే రీతిలో అనువదించుకున్నాను. పాళి, సంస్కృతం, ఇంగ్లీషు ప్రతులను అధ్యయనంచేసి, తెలుగు సేతజేశాను. ఇతర తర్జుమాగ్రంథాలతో, కొన్ని వ్యాఖ్యానాలతో సరిచూసుకొన్నాను. నావ్రాతను నేను మళ్లీ సరిచేసుకొన్నాను. సులభశైలిలో, సామాన్యపదాలతో, మాత్రా ఛందస్సులో వ్రాశాను. వివిధ బాణీలలో ఉన్నాయి. సుళువుగా చదువు కోవచ్చునీ, మరియు పాడుకోవచ్చునీ ఇలా చేశాను.

ఒక్కొక్క అధ్యాయంలో ఆకట్టుకొనే ఒకటి, రెండు పద్యాలను ఈ క్రింది పట్టికలో పొందు పరుస్తున్నాను. దీనిని ధమ్మపదసారంగా, సంక్షిప్త బౌద్ధ ధర్మంగా భావించవచ్చును. వాటి యందలి మాధుర్యాన్ని బట్టి ధమ్మపదం మొత్తం చదవ గలరని ఆశిస్తున్నాను.

## ముఖ్యమైన శ్లోకాల వివరణ పట్టిక

| పేజీ | శ్లోకం | వర్గం | పేజీ | శ్లోకం | వర్గం |
|---|---|---|---|---|---|
| 15 | 1,3,13 | యమకవర్గం | 63,64 | 5 | సుఖవర్గం |
| 21 | 1 | అప్రమాదవర్గం | 66 | 4 | ప్రియవర్గం |
| 26 | 11 | చిత్తవర్గం | 69-72 | 2,7,13 | క్రోధవర్గం |
| 28 | 4 | పుష్పవర్గం | 76,77 | 17,19,20 | మలవర్గం |
| 32 | 2 | బాలవర్గం | 78,79 | 3,6,11 | ధర్మస్థవర్గం |
| 40 | 4 | సహస్రవర్గం | 81-84 | 1,7,16,17 | మార్గవర్గం |
| 47 | 1 | దండవర్గం | 85,87 | 5,14 | ప్రకీర్ణకవర్గం |
| 51 | 1 | జరావర్గం | 88,90 | 2,13 | నిరయవర్గం |
| 55 | 9,10 | ఆత్మవర్గం | 91,93 | 3,4,10 | నాగవర్గం |
| 57-58 | 4,5,6,9 | లోకవర్గం | 95-99 | 6,14,20,23 | తృష్ణావర్గం |
| 60-61 | 5,8,9,10,11 | బుద్ధవర్గం | 102,105 | 6,8,20 | భిక్షువర్గం |
| | | | 108-116 | 5,9,11,14,26,41 | బ్రాహ్మణవర్గం |

## బుద్ధునిగూర్చి ఒక్కమాట

అన్నిటినీ జయించితి - అన్నిటినీ ఎరింగితి
అన్ని ధర్మాలలో - అనులిప్తుడనైతి
అన్నిటినీ వదలితి - అటులె తృష్ణ త్యజించితి
స్వయంగా జ్ఞాన మొందితి - స్వీకరింప గురువెవ్వరు? (24-20)

## ధర్మం గూర్చి ఒక్కమాట

ధర్మ దానమునకు జయం సర్వ దానములలో,
ధర్మ రసానికి జయం సర్వరసాలలో,
ధర్మరతి జయిస్తుంది సర్వరతులలో,
తృష్ణలేమి జయిస్తుంది సర్వ శ్రమలలో. (24-21)

## 'ధమ్మపద' సారపదం

చెడును చేయకు మెంచి
అభ్యసించుము మంచి
చిత్తమును కడిగుంచు
బుద్ధులిటు శాసించె. (14-5)

## బుద్ధ వందనం-స్తుతి

**త్రిశరణాలు**

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

**బుద్ధ వందనం**

నమో తస్స భగవతో అరహతో
సమ్మా సమ్బుద్ధస్స.

అర్హతుడు, సమ్యక్ సంబుద్ధుడు అయిన బుద్ధభగవానునికి నమస్సులు.

అర్హతుడు - బౌద్ధ జ్ఞానం ద్వారా, ధర్మాచరణద్వారా బుద్ధుడు కావడానికి తగిన విలువైన ఉత్తమపురుషుడు; నిత్యజాగరూకుడు; బంధాలు తెంచిన వాడు.

సమ్యక్ - సరియైన, సక్రమమైన, సమమైన, సముచితమైన, తగిన
సంబుద్ధుడు - అత్యంత బోధి (మంచి జ్ఞానం) పొందిన బుద్ధుడు.

భగవానుడు - ఐశ్వర్యం, వీర్యం, యశం, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం అను ఆరులక్షణాలు (భగవద్గుణషట్కం) గలవాడు.

## కృతజ్ఞతలు

పాళి, సంస్కృతం- తాత్పర్యంతో కూడిన మౌలిక పుస్తకంతోను, హిందీ అనువాదంతోను సరిచూసి పరిష్కరించిన **శ్రీ స్వామి అచలానందసరస్వతి** వారి శ్రమకు కృతజ్ఞుడను. అట్లే శ్రద్ధగా డి.టి.పి. చేసిన జి. సదాశివయ్య, యస్. మనోహరమ్మగార్లకును కృతజ్ఞతలు తెల్పుచున్నాను.

*- రచయిత*

# ధమ్మపదం

## 1. యమక వర్గం ( మనసు నిగ్రహం)

యమకం అంటే ద్వయం. ఇందులో పది జతల గాథ లున్నాయి. ఒక్కొజత ఒక విషయాన్ని అనుకూలాంశాలతోను, వ్యతి రేకాంశాల తోనూ వివరిస్తుంది. ఇందులోని విషయం మనసు- నిగ్రహం.

స్థలం : శ్రావస్తి
వ్యక్తి : చక్షుపాలుడు (వృద్ధభిక్షువు)

అన్ని ధర్మాలకు
మనసు ముందుంటుంది,
ఎన్నగా అన్నిటిలో
మనసే ప్రధానం
మనసే నిధానం;
చెడు మనసుతో ఏమి
చెప్పినా చేసినా
వడిగ వెంటాడును దుఃఖం
అడుగులను చక్రాలు
అనుసరించే రీతి. 1

(ఇక్కడ ధర్మం అంటే మనో ధర్మం; లేక మానసిక స్థితి. అదే మానసిక చేతనం. స్థితిని బట్టి లేక చేతనం అనుసరించి కర్మ ఉంటుంది. కాబట్టి ధర్మం అంటే కర్మ అని గ్రహించాలి. చేతనమే కర్మ అని బుద్ధుడు చెప్పియున్నాడు.) అడుగులు రథాశ్వములవై నా కావచ్చు, లేదా బండి ఎద్దులవి అయినా కావచ్చు.

శ్రావస్తి-
మట్టకుండలి

అన్ని ధర్మాలకు
మనసు ముందుంటుంది
ఎన్నగా అన్నిటిలో
మనసే ప్రధానం

మనసే నిధానం
మంచి మనసుతొ ఏమి
చెప్పినా చేసినా
తోడవును సౌఖ్యం
వీడని నీడలా. 2

శ్రావస్తి- (జేతవనం)
థుల్లతి (థేరు)

నన్నతడు తిట్టాడు
నన్నతడు కొట్టాడు
నన్ను ఓడించాడు
నన్నుదోచాడనీ
వేమారు చింతించువారికి
వైర మెన్నడు తీరబోదు. 3

నన్నతడు తిట్టాడు
నన్నతడు కొట్టాడు
నన్ను ఓడించాడు
నన్నుదోచాడనీ
వేమారు అనుకోని వారికి
వైరముపశమించి తీరును. 4

శ్రావస్తి-కాలీ

వైరమున ఎన్నడు
వైరము తీరదు
వైరరహితం తీర్చుతుంది
ఇదియే సనాతన ధర్మం. 5

శ్రావస్తి- కోసంబిక (భిక్షువు)

అజ్ఞులకు తెలియదు
"అందరం పోదుమ"ని
అది తెలిసిన జనుల
అలజడులు శాంతించు. 6

శ్రావస్తి - మహాకాలుడు

దృశ్యవిషయాలకు
ప్రీతిచెందేవాడు
ఇంద్రియాలను అదుపు
చేయలేని వాడు,
మితము తప్పి తిండి
మెక్కి మసలే వాడు,
సోమరితనమున
సొమ్మసిల్లేవాడు,
నీరసమున కృషి
చేయనేరని వాడు,
పెను గాలిచే చిన
మాను కూలు నట్లు
'మారుని' వేటుకు
బోర్లపడతాడు. 7

దృశ్యవిషయాలకు
ప్రీతి చెందనివాడు
ఇంద్రియాలను అదుపు
చేయ గల్గిన వాడు
మితము తప్పక తిండి
మెసవ గల్గేవాడు
శ్రద్ధాళువుగ కృషిని
సల్పేటి వాడు
గాలితాకిడికి
కదలని కొండలా
మారుని వాతబడి
మారిపో జాలడు. 8

శ్రావస్తి- దేవదత్తుడు

కల్మషాలు తొలగకనే
కాషాయం ధరించినా
దమము, సత్యము లేక
డాంబికముగ చరించినా
కాషాయానికి ఆతడు
కొరగాడు, సరిపోడు. 9

చిత్త దోషాలను
చేర నీయని వాడు
శీల సంపత్తిలో
స్థిరమైన వాడు
సత్యము సంయమం
సమముగా గలవాడు
కావి బట్టలు కట్ట
కడు తగిన వాడు. 10

రాజగృహ- సంజయుడు

సారము లేనిది
సారవంతమని
సారము గలది
సారహీన మని
తలపున భ్రమలో
మెలిగే వానికి
సారమైనదిక
సంప్రాప్తించదు. 11

సారమైనది సారవంతమని
సారహీనమును సారహీనమని
చూడగల్గిన సమ్యక్ వ్రతుడు
సారమునే మరిసదాపొందును. 12

ఇంటి కప్పు పాడయితే
ఇంటిలోన వానపడును
మనసు అదుపుతప్పితేనో
మనసున కామం జొరబడు.

శ్రావస్తి- నన్ద (థేరు)

13

ఇంటి కప్పు బాగుంటే
ఇంటిలోన వాన పడదు
మనసు అదుపులో ఉంటే
మనసున కామం చేరదు.

14

చెడు పనులు చేసే వాడు
పడతాడు ఇడుములలో
ఈ లోకంలోనే కాదు
ఏ లోకంలో నైనాను
రెండు లోకాల లోన
రోదిస్తుంటాడు బాధగా,
చెడు పనులు తలంచుకుంటూ
శోకిస్తాడు కృశించిపోతూ.

రాజగృహ-చున్దా

15

మంచి పనులు చేసేవాడు
మోద మొందుతాడు మదిలో
ఈ లోకంలోనే కాదు
ఏ లోకంలో నైనాను
అన్ని లోకాల లోన
ఆనందిస్తాడు బాగుగా
మంచి పనులు తలంచుకుంటూ
మరి మరి మోదం చెందుతాడు.

శ్రావస్తి - ధమ్మిక (ఉపాసకుడు)

16

చెడు పనులు చేసే వాడు
పడతాడు దుఃఖంలో
ఈ లోకంలోనే కాదు
ఏ లోకంలో నైనాను

శ్రావస్తి- దేవదత్తుడు

రెండు లోకముల లోన
రోదిస్తుంటాడు బాధగా
'నేనీ చెడు చేశానంటూ'
ఎనలేని వేదన పొందును
దుష్ఫలముల మూలాన
దుర్గతితోదుఃఖతుడౌను. 17

శ్రావస్తి- సుమనా దేవి

మంచి పనులు చేసేవాడు
మహిలో ఆనందం పొందును
ఈ లోకంలోనే కాదు
ఏలోకంలో నైనాను
రెండు లోకముల లోన
కొండంతానందం చెందును
'నేను మంచి చేశానంటూ'
నెమ్మనమున సంతస మొందును
సత్ఫలముల మూలాన
సద్గతి సమ్మోదం చెందును. 18

శ్రావస్తి- ఇరువురు మిత్రులగు భిక్షువులు

చదివినను గ్రంథాలెన్నో
చెప్పబడినది చేయకుండగ
ప్రమత్తుడుగా నుండువాడు
పరుల గోవుల లెక్కబెట్టే
గోపబాలుని వంటి వాడు
కాలేడు శ్రమణుడతండు. 19

చదివినది ఏ స్వల్పమైనా
తదను సారపు ధర్మశీలుడు,
రాగ ద్వేషమోహములను
రయముగ త్యజియించినతడు,

చక్కగా విజ్ఞాన మొందుచు
చిత్త స్వేచ్ఛ నొందినతడు,
ఇహము నందున పరమునందున
ఎట్టి కోరిక లేని వాడు,
అర్హతుడుశ్రమణత్వమునకు
అగును ఆతడు శ్రామణేరుడు. 20



## 2. అప్రమాదవర్గం - జాగృతి

అప్రమాదమంటే అప్రమత్తత, జాగరూకత. ధార్మిక జీవనానికి ముఖ్యలక్షణం. దాని ఆవశ్యకతను ఈ వర్గంలో చూడవచ్చు.

కౌశాంబీ (ఘోషితారామం)- సామావతి (రాణి)

జాగరుకత అమృతత్త్వం (నిబ్బణం)
జాగరూకత లేమి మృత్యువు
జాగరూకుడు మరణమొందడు-అ
జాగరూకుడు మృత్యుసముడు. 1

ప్రాజ్ఞులీ విధి తెలిసి - ఆర్యుల
మార్గమందనురక్తులై - కడు
జాగరూకతతో చరించుచు
సంతసింతురు ఎల్లవేళల. 2

నిత్యము ధ్యానించు వాడు
చిత్తదార్ఢ్యం ఉన్న వాడు
శౌర్య వంతుడు, ధైర్య వంతుడు
యోగక్షేమం కలుగజేయును
శ్రేష్ఠమగు నిర్వాణ మందును. 3

రాజగృహం- కుంభ ఘోసక.

స్వప్రయత్నము - అప్రమత్తత
శుద్ధ కర్మ-విచక్షణములు

నియమ - ధర్మ - జాగృతియుగల
నరునికీర్తి వృద్ధిజెందును. 4

రాజగృహం (వేణువనం)-
చుళ్లపన్తక (వృద్ధ భిక్షువు)

స్వప్రయత్నం అప్రమాదం
సంయమం దమమును కల్గి
తనకు తానుగ మేధావి
ద్వీపముగ నిర్మితంబౌను
వరదలోమునగని రీతి. 5

(విషయ సుఖముల వరదలో మునిగి పోకుండా మేధావి దృఢమనోద్వీపమును నిర్మించుకొనును.)

జేతవనం- బాలనక్షతఘుట్ట
(హోలి)

మూర్ఖులు-దు
దుర్మేధులు
ప్రమత్తతలో
పడిపోతారు,
మేధావి
అప్రమత్తతను
శ్రేష్ఠధనంగా
రక్షిస్తాడు. 6

ప్రమాదమున పడకుండ
కామానందం విడిచి
జాగృతిని వహించువాడు
ధ్యానంలో సుఖియించు. 7

జేతవనం- మహా కస్సప
(వృద్ధ భిక్షువు)

ప్రజ్ఞావంతుడు జాగరూకుడయి
ప్రమాదమునకు ప్రక్కకు తొలుగు
ప్రజ్ఞానమను భవనం ఎక్కి
అజ్ఞానులను వీక్షించు
పర్వత శిఖరం ఎక్కినవాడు
భువిపై వారిని చూసినట్లుగా. 8

జాగరూకుడుగాను
జాగరూకుల లోన
మేల్కొన్నవాడుగా
నిద్రించువారిలో
బుద్ధిమంతుడుఉండు,
బలమైన గుర్రము
బలహీన గుర్రాన్ని
దాటిపోవునట్లు
అతడతిశయించు. 9

జాగరూకతవల్లనే — వైశాలీ (కూటాగారం)
'మఘవా'అయ్యెను నేత [మఘవా= ఇంద్రుడు] — మహాలీ
దేవతలందరిలోన
అప్రమత్తుని పొగుడుతారు
అందరూ జేరి ప్రమత్తుని
నిందిస్తూ ఉంటారు. 10

స్థూల సూక్ష్మాలను నిప్పు — జేతవనం- ఒకానొక భిక్షువు
కాల్చుకుంటూపోవునట్లు
అప్రమత్తతలో రతుడై
ప్రమత్తతలో భీతుడై
ఉండునట్టి భిక్షువు
ముందుకు పోతుంటాడు. 11

అప్రమత్తతలో రతుడై — జేతవనం- నిగమ నివాసి యగు తిస్స్యుడు
ప్రమత్తతలో భీతుడగు
భిక్షువు చెందడు పతనం
పొందుతాడు నిబ్బాణం. 12



## 3. చిత్త వర్గం

చిత్తం చంచలమైంది. అదొక భావన స్థితి. సంకల్ప వికల్పాలకు మూలం, ఆలోచనకు నిలయం. మనసుకు మరో రూపం చిత్తం. దాన్ని నిత్యమూ గమనిస్తూ అదుపు చేసుకుంటూ, సరిచేసుకుంటూ, వినియోగించుకోవాలని ఇందులో బుద్ధుడు చెబుతాడు.

చాలిపర్వతం-
మేఘియుడు

చిత్తం చంచలం
చపలం కూడా,
అరక్ష్యంఅది
అనివార్యం కూడా
మేధావి దాన్ని
ఋజువుగ జేయు
శరకారి శరము
సరి చేయునట్లు. 1

నీటి బయట చేప
నేల విల విల లాడు
మారుని వాతబడి
మనసు విల విల లాడు 2

శ్రావస్తి

దుర్నిగ్రహమైనది
సూక్ష్మత్వం గలది
తలచినంతనే పోవును
తక్షణమే ఎచటికైన
అట్టిదైన చిత్తాన్ని
అదుపుచేయుటుత్తమం
అదుపున్న చిత్తం
అందించును సౌఖ్యం. 3

దానిది అతినైపుణ్యాం
తలంచినంతనే పోవును
తత్క్షణమే ఎచటికైన
అట్టిదైన చిత్తాన్ని
కాపాడును మేధావి
కాపుదల గల చిత్తం
కల్గించును సౌఖ్యం. 4

శ్రావస్తి- ఒక జిజ్ఞాసువగు భిక్షువు

దూరాలకు ఏగును
ఒంటరిగ తిరుగును
అశరీరి యైనది
గుహయందు దాగును
అట్టిదగు చిత్తాన్ని
సంయమించిన వారు
మారుని బంధాల్ని
విడిపించు కొందురు. 5

శ్రావస్తి- సంఘరక్షితుడు

ఎవరి మనసునకు లేదో నిలకడ
ఎవరు ఎరుగరో సద్ధర్మం
ఎవ్వరు లేరో సుప్రసన్నంగ
వారిప్రజ్ఞయు అపరిపూర్ణం. 6

శ్రావస్తి- చిత్త హత్థుడు

ఎవరి చిత్తము నిర్మలమో
ఎవరి చిత్తము సుస్థిరమో
ఎవరు పాప పుణ్యరహితులో
వారు నిజంగా అప్రమత్తులు
వారి కెన్నడుభయమే లేదు. 7

దేహమును ఒక కుండగాను
చిత్తమును ఒక నగరి గాను
తెలిసి, ప్రజ్ఞాయుధముబూని
మారునితొ పోరాడవలెను
జయమునూ రక్షించుకొంటూ
అనాసక్తిగ బ్రతకవలెను.

శ్రావస్తి- 500 విపశ్యక భిక్షువులు

8

కాలమెంతో గడువకుండా
రాలిపోవును ఈశరీరం
క్షుద్రమై చేతనం లేక
నిరుపయోగపు కట్టె లాగ.

శ్రావస్తి- పూతిగత్తతిస్స
(వృద్ధ భిక్షువు)

9

ద్వేషి ఒక ద్వేషికి
వైరి ఒక వైరికి
చేయుకీడును మించి
చెడువైపు వెళ్ళేటి
చిత్తమే చేయును.

కోసలదేశం- నన్ద (గోపాలుడు)

10

(మనసుకున్న పది చెడులు:- చంపుట, చౌర్యం, అపవిత్రతత, అబద్ధం, అపనింద, కఠిన వచనం, పనికిరాని పలుకులు, దురాశ, చెడుతలంపు, తప్పు నమ్మకం)

తల్లి చేయ లేని మేలు
తండ్రి చేయ లేని మేలు
బంధువు చేయని మేలు
మంచి వైపు వెళ్ళేటి
మంచి మనసు చేయును.

కోసల దేశం- సోరయ్య
(వృద్ధ భిక్షువు)

11

(మనసుకున్న పది మంచి లక్షణాలు :- ఔదార్యం, నీతి, ధ్యానం, గౌరవం, సేవ, ప్రతిభ ప్రదానం, పరుల ప్రతిభకు సంమోదం, ధర్మశ్రవణం, ధర్మ బోధ, సదభిప్రాయాల సూటిదనం:)



# 4. పుష్ప వర్గం

పుష్పాన్ని సంకేతంగా తీసుకొని చెప్పిన ధర్మసందేశం.

దేవతలతో సహా　　　　　　　　　　　　　　　శ్రావస్తి-500 భిక్షువులు
ఈ యమలోకాన్ని
ఈ భూలోకాన్ని
ఎవడు జయించు?
సుబోధితమైన
ధార్మిక పదాలను
పువ్వుల మాదిరి
ఏ కుశలుడేరు ?　　　　　　　　　　　　　　　　　　　　1

దేవతలతో సహా
ఈ యమలోకాన్ని
ఈ భూలోకాన్ని
శైక్షుడు* జయించు.　　　　　　*సుశిక్షితుడైన శిష్యుడు
సుబోధితమైన
ధార్మిక పదాలను
పువ్వుల మాదిరి
కుశల శైక్షుడు ఏరు.　　　　　　　　　　　　　　　　　　2

నురుగు మాదిరిదని　　　　　　　　　　శ్రావస్తి- మరీచి (వృద్ధ భిక్షువు)
ఎండమావి యటంచు
ఈకాయమునుగూర్చితెలుసుకో
మారుని సుమశరం
ఛేదించి, యమరాజు
చూపు పడకుండగ జేసికో.　　　　　　　　　　　　　　　　3

వరద వెల్లువ పొంగి　　　　　　　　　　　　　　　　శ్రావస్తి-
నిద్రించు గ్రామాన్ని　　　　　　　　　　　　　　　విదూడభుడు
సరగున ముంచేసి

పరుగు దీయు నట్లు
విషయ సౌఖ్య సుమాలు
పోగేసు కొను వాణ్ణి
తృప్తి చెందక ముందే
మృత్యువు గొనిపోవు. 4

రాగ సుమాలందాసక్తునికి
భోగానుభవం తీరకమున్నే
మృత్యు వాతని
వశం జేసుకొను. 5

శ్రావస్తి- కోసియ వ్యాపారి

పువ్వుల వర్ణము, పుప్పొడి
పాడవ కుండా జూచి
భ్రమరం మకరందాన్ని
త్రావి వెళ్లిపోవును
అట్లే ముని, గ్రామంలో
సంచరించిపోవలెన్. 6

పరుల తప్పులెంచకు
పరుల కృతాకృతముల
పరికించి చూడకు
నీ చేష్టల అచేష్టలను
నీవే పరికించుకో. 7

శ్రావస్తి- పాఠిక (సాధువు)

అందము రంగున్న కూడ
తావిలేని పూవులాగ
ఆచరించని మంచి వాక్కులు
వ్యర్థమే యగును. 8

శ్రావస్తి- ఛత్తపాణి (ఉపాసకుడు)

అందము రంగున్న యట్టి
తావి కల్గిన పూవులాగ
ఆచరించే మంచి వాక్కులు
సఫలమేయగును. 9

పూల రాశి నుంచి ఎన్నో
పూల మాలలు అల్లునట్లు
మనిషి పుట్టినమీదటెన్నో
మంచి పనులు జేయవలెను. 10

శ్రావస్తి- పూర్వారామం విశాఖా-
(ఉపాసకురాలు)

పుష్ప-చందన-అగరు-మల్లెల
పరిమళం గాలి దిశకే వీచు
వేరు దిశకు పోవ జాలదు,
సజ్జనుల సచ్ఛీల సౌరభం
గాలి కెదురైననూ వీచు,
కారణం, సచ్ఛీల వంతుడు
సర్వదిక్కుల సంచరించును. 11

శ్రావస్తి- ఆనంద
(థేరు)

కస్తూరీ చందనాల
అగరూ కమలాల
సువాసనల కన్నా
సదాచార శీల గంధ
సువాసనే బహు మిన్న. 12

అగరు చందనాల
సువాసనలు అల్పం
శీలవంతుని గంధం
దేవతలకు సైతం
ఉత్తమమై వ్యాపించు. 13

రాజగృహ (వేణువనం)-
మహాకస్సప

శీల సంపద కలిగి
అప్రమాద వర్తనులై
సమ్యక్  జ్ఞానం చేత
ముక్తులైన వారి మార్గం
'మారుడు' కనుగొనలేడు.

రాజగృహ-గోధిక (వృద్ధ భిక్షువు) 14

మహామార్గ మందున
చెత్తకుప్పలోపుట్టి
సుందరమై పరిమళించు
పద్మముద్భవించునట్లు
చెత్తవంటి అజ్ఞుల
అంధప్రాయులమధ్య
సమ్యక్ సంబుద్ధ శిష్యు
డుజ్వలించు తన ప్రజ్ఞతో.

జేతవనం-గరహాదిన్న 15,16



**సుచరితులు**
**కావాలంటే**
**ధమ్మపదమే**
**శరణ్యమ్.**

# 5. బాలవర్గం

బాల అంటే మూర్ఖుడు, అజ్ఞాని; అవిద్య, మోహాల ఫలితం. చతురార్య సత్యాలు తెలియక పోవడం అవిద్య. జీవితం శాశ్వతమని బంధాలలో పడడం మోహం. ఈరెంటినీ ఛేదించ మని ఈవర్గం చెపుతోంది.

జాగరూకునికి రాత్రి సుదీర్ఘం — శ్రావస్తి - దరిద్ర సేవకుడు
డస్సిన వానికి దారి సుదూరం
సద్ధర్మం తెలియని మూర్ఖునికి
సంసారం దీర్ఘాతి దీర్ఘం. 1

సముద్రా శ్రేష్టుడు చిక్కకఉంటే — రాజగృహ - సార్థవిహారీ (శిష్యుడు)
సాగుముఒంటరిగ స్థిరమ్ముగ
చేయరాదు సహవాసమెన్నడు
సమముగాను మూఢాత్మునితో
(సజ్జనుండు లభించ కుంటే
సంచరించుము ఒంటిగా,
చేయ బోకుము స్నేహమెన్నడు
చేయిసాచి మూఢ మతితో). 2

'నాకు పుత్రులు గలరు — శ్రావస్తి - ఆనంద (వ్యాపారి)
నాకు సంపద గలదు'
అజ్ఞుడిటు చింతించు
తాను తన సొంతమే
గాకున్న స్థితియందు
తనకు ధనము సుతులు
సొంతమగు టెటులు? 3

తనకేమీ తెలియదని
తెలిసినవాడే విజ్ఞుడు
తనకేమీ తెలియకున్నా
తెలియునను వాడజ్ఞుడు.

జేతవనం - గిరి హటక చోదకుడు

4

అన్నంలో తిరిగే గరిటెకు
అన్నపు రుచి తెలియనట్లుగ
పండితుల యావజ్జీవం కొల్చినా
ధర్మం తెలియదు మూర్ఖునకు.

శ్రావస్తి - ఉదాయి (వృద్ధభిక్షువు)

5

అన్నం రుచి నాలుకెరుగు
అటులే కొద్ది కాలమైన
పండితులను సేవించిన
విజ్ఞుడెరుగు ధర్మం.

శ్రావస్తి - భద్రవర్గీయం (భిక్షుసమూహం)

6

చేదు ఫలములనిచ్చు
దుష్ట కర్మలు జేయు
దుర్బుద్ధి మూర్ఖమతి
తనకు తానగు వైరి.

రాజగృహ-సుప్పబుద్ధుడు

7

పని చేశాక పరితాపాన్నీ,
కన్నీటి ముఖం, ఏడుపు ఫలమును
కలిగించేపని సరిగ చేయనిది
అట్టిపనిని చేయగరాదు.

జేతవనం - కస్సపుడు

8

పని చేశాక పరితాపమిడని
ఫలితంగా సుమనస్సానందం
కలిగించే పని సరిగ చేసినది
అట్టి పనిని చేయం తగును.

వేణువనం -సుమన

9

పాపం పండనంత వరకు
పాపకర్మ తీయననుకొను
పాపం పండినతోడనె
మూర్ఖుడు దుఃఖితుడౌను.

జేతవనం - ఉప్పలవణ్ణా
(వృద్ధభిక్షురాలు)

10

నెలల కొద్దీ మూర్ఖుడు
కుశాగ్రంతో భుజించినా
ధర్మజ్ఞులలో పదారవ
వంతు సముడు కాడు.

రాజగృహ - జంబుకుడు
(సాధువు)

11

అప్పటి పాలప్పుడే
పెరుగు కాని యటులే
చేసిన పాపిష్టి చర్య
వికటించదు వెంటనే
నివురు కప్పిన నిప్పువలె
పాపిని దహించుచుండును

రాజ గృహ -
అహిపేతుడు

12

మూర్ఖుడు పొందే జ్ఞానం
మూర్ఖునికే ముప్పుతెచ్చు
తెలివున్నా హరించేసి
తలదించుకొనేట్లుచేయు.

రాజగృహ -
సట్ఠికూటుడు

13

అజ్ఞాని వాంఛించును
తనకు తగని దానిని
భిక్షువుల్లో సన్మానం
ఆరామాల అధికారం
పరకులీనుల పూజలు;

జేతవనం - సుధమ్మడు
(వృద్ధభిక్షువు)

14

"గృహస్థులు ప్రవ్రజితులు
నేజేశానిది యనాలి

కార్యాకార్యములలోన
నావశమైయుండాలి''
ఇవ్విధమున మూర్ఖుడుతన
ఇచ్ఛ, అహం పెంచుకొనును. 15

లాభ మొసగు మార్గం వేరు
నిర్వాణం మార్గం వేరు
ఇది తెలిసిన బుద్ధానుయాయి
సత్కారాదులను కోరక
వివేకమును పెంచుకొనాలి. 16

శ్రావస్తి - త్రిస్యుడు
(వనవాసి వృద్ధభిక్షువు)



## 6. పండిత వర్గం

పండితుడంటే జ్ఞానం గలవాడని చెప్పబడింది. జ్ఞాని లక్షణాలు చెప్పబడ్డాయి. జ్ఞాని సాంగత్యం శ్రేయస్కరమని తెలుస్తుంది.

నిధుల ఉనికి తెలుపునటుల
వర్జనీయము లెంచిచూపే
సంయమిని మేధావిని గని
పండితునిగ భజించవలెను,
అటుల జూచి భజించు వానికి
శ్రేయమబ్బును పాపమొదవదు. 1

జేతవనం - రాధుడు
(వృద్ధభిక్షువు)

సదుపదేశం చేయువాడు
ధర్మశాసకు డైన వాడు
దుష్ట చర్యను దునుమువాడు
సజ్జనులకు ప్రీతి పాత్రుడు
దుర్జనుల కప్రీతి పాత్రుడు. 2

జేతవనం - అస్సజీ,
పునవ్వసూ

దుష్ట మిత్రుల కూడవద్దు
అధములను సేవింపవద్దు
శిష్ట మిత్రుల కూడవలయు
ఉత్తములను భజింప వలయు. 3

జేతవనం - ఛన్నుడు (వృద్ధ భిక్షువు)

ధర్మపాలన చేయువారు
శాంతముగ సుఖనిద్ర జేతురు
పండితులు నిరతం రమింతురు
ఆర్య విదిత ధర్మమందు. 4

జేతవనం-మహాకప్పినుడు (వృద్ధ భిక్షువు)

నిపుణులు నీటిని
నడుపుదురు
కమ్మరులు బాణముల
వంచుదురు
వడ్రంగులు
కొయ్యను సరి చేతురు
పండితులాత్మ
దమనము జేతురు. (ఈ విషయం దండ వర్గం 17 వ గాథలో వుంది) 5

శిలలచే ఘనమైన అచలం
గాలి దెబ్బకు కదలనట్లు
కలుగు నిందాస్తుతులకేమీ
చలనమొందడు పండితుండు. 6

జేతవనం - భద్దియ (వృద్ధభిక్షువు)

నిశ్చలమైన, నిండైన
స్వచ్ఛమైన సరస్సు వోలె
ధర్మమును విని పండితుండు
పరమ శాంతిని పొందుచుండు. 7

జేతవనం - కాణ, మాతా

సజ్జనులు సర్వత్ర సంచరింతురుగాని
కామసుఖ విషయాల
గూర్చి మాట్లాడరు,
సుఖ దుఃఖముల జూచి
పండితులు చెదరరు.

జేతవనం - 500 భిక్షువులు

8

తనకొరకుగాని ఇతరులకొరకు గాని
ధన పుత్ర రాజ్యాలను కోరడెవడో
తన వృద్ధికెవడు అధర్మాన్ని చేయడో
అతడెపో సద్గుణి ప్రజ్ఞాని ధార్మికుడు.

జేతవనం - ధమ్మికుడు (వృద్ధ భిక్షువు)

9

కొద్ది మందే ఉంటారు
తీరం దాటే వారు
తీరంపై ఇతరులంతా
తిరుగాడుతు ఉంటారు.

జేతవనం - ధర్మశ్రవణుడు

10

చక్కగా తెలిసిన ధర్మం
ఆచరించే వారు మాత్రమే
మృత్యుగ్రస్త దుస్తరంబగు
సంసారం దాటి పోదురు.

11

దుష్ట కర్మలు మానవలెను
శిష్ట కర్మలు చేయవలెను
స్వగృహమ్మును వీడవలెను
పండితుడు దూరముగబోయి
ఉండవలె ఏకాంతవాసుడై
పండితుని రీతిదియే తెలియ..

జేతవనం - 500 నూతన భిక్షువులు

12

భోగములు విడనాడవలెను
సర్వమును త్యజియించవలెను

శుచిగ చిత్తమునుంచవలెను
పండితుని రీతిదియే తెలియ. 13

ఎవరి చిత్తం బాగా
సంబోధియంగముల
స్థిరముగా నిలుచునో,
లంపటము లేనట్టి
అపరిగ్రహం తోడ,
మలినాలు బోనాడి
వెలుగొందుచుండునో,
అట్టి వారికి కల్గు
భువిని నిర్వాణంబు. 14



## 7. అర్హన్తవర్గం

అర్హతుడు ఉత్తమ పురుషుడు. అతడు జీవన్ముక్తుడు, బోధిసత్త్వుడు, బుద్ధుడు. అతజు పూర్తిగా దోషరహితుడని బుద్ధుడు చెప్పాడు.

రాజగృహ ఆమ్రవనం - జీవకుడు

గమ్యస్థానం చేరిన
శోకం విడనాడి నట్టి
సర్వత్రా విముక్తుడగు
సకల బంధములు తొలిగిన
వాని కింక ఉండబోదు
జ్వరం లాంటి పరిదాహం. 1

రాజగృహ-మనోకస్యపుడు

ఉద్యుక్తులు స్మృతి మంతులు
అనికేతులుగా నుందురు
మడుగుల విడు హంసలవలె
గృహం విడిచిపోవుదురు.

పోగు జేసుకోపూనని వారు
భోజన నియమం తెలిసిన వారు
నిర్హేతుకము శూన్యమునైన
నిర్వాణమును ఎరిగినవారు
విహంగ మార్గం కనపడనట్లుగ
విహరింతురితరులెరుగని రీతిగ.

జేతవనం - వేలట్ఠి సీసుడు

3

మలిన మెరుగని మంచి
మనసుకలిగిన వారు
భుక్తిపై ఆసక్తి
పెట్ట కుండే వారు
సూక్ష్మమైన
ముక్తిదర్శనంకలవారు
అంతుదొరకరుగా
విహంగమార్గం వోలె.

రాజగృహ - అనిరుద్ధుడు (వృద్ధ భిక్షువు)

4

సారధి చే శిక్షణపొందిన
అశ్వాలవలె ఇంద్రియాలు
ఎవనికి స్వాధీనమగునో
ఎవనికి అభిమానముడుగునో
అట్టివానిని, దోషరహితుని
దేవతలునూ ప్రస్తుతింతురు.

శ్రావస్తి - మహాకచ్చాయనుడు

5

సువ్రతము కలవాడు
భూమివలె, ఇంద్ర
కీలాద్రివలె స్థిరముగ
నిర్మల జలమున్న
సరసువలె శుద్ధిగా

జేతవనం - సారిపుత్తుడు (వృద్ధ భిక్షువు)

సంసారదోషాల
స్పర్శలేకుండును. 6

ఉత్తమజ్ఞానమున
ముక్తుడైనవాని
శాంతుడై సమదర్శ
క్రాంతుడైన వాని
మనసు వాక్కు కర్మ
శాంతమై ఒప్పును 7

జేతవనం - కోసంబి బాసిత తిస్సుడు (వృద్ధ భిక్షువు)

లోకమందశ్రద్ధ కలిగి
'అకృతం' బగు ముక్తి నెరిగి
'సన్ధి' యౌ సంసార మొదలి
దృశ్య అవకాశమును ద్రెంచి
విషయ వాంఛల వీడినట్టి
వాడె ఉత్తమ పురుషుడు. 8

జేతవనం - సారిపుత్రుడు (వృద్ధ భిక్షువు)

గ్రామమందున వనమునందున
నిమ్న ఉన్నత స్థలము నందున
ఎచ్చటెచ్చట అర్హతులు సువి
హారమును గా వింతురో
అట్టి స్థలమే శుభప్రదము
అదియెరమణీయప్రదేశము. 9

జేతవనం- (ఖదిరవనీ) రేవతుడు (వృద్ధ భిక్షువు)

జనము ఆనందమును పొందని
సొగసు చిందు అరణ్యములలో
కామభోగపు ఆశలెరుగని
రాగరహితులు సంచరింతురు. 10

జేతవనం- అరణ్యాక భిక్షువు



# 8. సహస్రవర్గం

వంద, వేయి సంఖ్యలను చిహ్నంగా తీసుకొని యాంత్రిక కర్మకాండలను నిరసించడం. అర్థంలేని కర్మకాండలతో శ్రద్ధ లేకుండా దీర్ఘకాలం జీవించడం కన్నా, జ్ఞానవంతమైన జీవితం కొద్ది కాలమున్నా అది గొప్పది అని చెప్పడం.

వ్యర్థ పదాల వేయి వాక్యములు
విలువ లేనివగు, వాటి కన్న
వినిన తోడునే శాంతి నిచ్చే
ఒక్క సార్థక పదమే మిన్న.

వేణు వనం: తమ్బదాఠికుడు (చోరఘాతకుడు)

1

వ్యర్థ పదాల సముచ్ఛయంతో
వేయి గాథలు వినడం కన్నా
వినిన తోడనే ఉపశమనంబిడు
ఒక్కగాథ శ్రేయస్కరమన్నా.

జేతవనం- దారుచీరియుడు (వృద్ధభిక్షువు)

2

వ్యర్థపదాలతో వేయి గాథలు
వివరిస్తూ వినిపించుట కన్నా
వినిన తోడనే ఉపశమనమ్మిడు
ఒక్క ధర్మపదం శ్రేయంబన్నా.

జేతవనం- కుండలకేసి (వృద్ధ భిక్షుణి)

3

సహస్రసహస్ర జనుల జయించి
సమరంలో జయం పొందవచ్చు
శ్రేష్టం తనను తా జయించడం
సంగ్రామంలో ఉత్తమ విజయం.

4

(సమరంలో శతసహస్రజనుల
జయించడం (ఘన) విజయంకాదు
తనలోతనకై తనను జయించుట
ఘనతరవిజయం, విజేత అతడే.)

ఇతర జనతతి పైన
జయము గాంచుటకన్న
ఆత్మజయము మిన్న
అదిశ్రేయమన్న
నియమము నిగ్రహము
నిజముగాగలవాని
జయము, నపజయము
పాల్జేయగా జాలరు
గంధర్వులే గానీ
ఘన దేవతలు గానీ
మారుడైనా బ్రహ్మ
తోడుగా నున్నను.

జేతవనం- అనర్థ -
పుచ్ఛకుడు (బ్రాహ్మణుడు)

5,6

వేలకువేలు శతవత్సరములు
నెలవారిగ యజ్ఞాలు చేసినా
విలువలేనివవి సాటిరావు మరి
ఒక్కసారి ఒక ముహూర్త కాలం
ఒక విజితాత్మని పూజాఫలముకు.

వేణువనం-
సారిపుత్తుని మామ

7

వనంలో వందేళ్ళ నిప్పు రాజే యొచ్చు
ఘనంగా నూరేళ్ళు యజ్ఞాలు చేయొచ్చు
కాని ఒక మారు విజితాత్మని పూజిస్తె
దాని ఫలమే మిన్న ఎన్ని జేసిన సున్న.

వేణువనం-సారిపుత్తుని
అల్లుడు

8

పుణ్యాన్ని ఆశించి
ఏడాది పొటున
దానాలు ధర్మాలు
ఏమైన జే యొచ్చు,

వేణువనం-
సారిపుత్రుని మిత్రుడు
(బ్రాహ్మణుడు)

ఒక్క ఋజువర్తనుని
కొక్కదండంబిడిన
తూగు దాని ఫలము
నాల్గురెట్లధికముగ;
ఆశ్రయించుమతని
అభివాదమొనరించు
అది నీకు శ్రేయస్సు. 9

అరణ్యకుటి దీఘాయు
కమారుడు

అతి సహజ శీలివై
అభివాదము సల్పి
వృద్ధులను సేవించు
వృద్ధిగాంచును నాల్గు;
ఆయువు వర్ఛస్సు
అతిబలము సౌఖ్యము. 10

జతవనం-
సంకిచ్చ (సాంకృత్య)
సామణేరుడు.

దుశ్శీలుడై నిగ్రహం లేనివాడుగ
పసలేక వందేళ్ళు బ్రతుకు-ఈడ్చుట కన్న
చక్కని శీలము, ధ్యానము కల్గి
ఒక్క దినమైన బ్రతికినచాలు, మేలు. 11

జేతవనం- కోణ్డఞ్ఞ
(వృద్ధ భిక్షువు)

లోలత్వం దుష్ప్రజ్ఞతో
నూరేళ్లు బ్రతుకుటేల
ప్రజ్ఞతోను ధ్యానంతో
ఒక్కరోజుబ్రతుకుమేలు. 12

జేతవనం- సప్పదాసుడు
(వృద్ధ భిక్షువు)

మందుడుగా కృషి లేక
అంధుడుగా వందేళ్లు
బ్రతికినచో ఫలమేమి?
కృషి వీడని వాడుగా

ఒక రోజైనా బ్రతికిన
అది మేలు, ఫలమధికం. 13

జేతవనం- పటాచారా
(వృద్ధ భిక్షుకురాలు)

పుట్టుకల గిట్టుకల
పూర్వాపరాలను
ఎరుగక నూరేళ్ళు
బ్రతకటం ఏల?
పుట్టుకల గిట్టుకల
పూర్వాపరాలను
బాగుగా దెలిసికొని
ఒక రోజుబ్రతికిన
చాలుఅది మేలు. 14

జేతవనం- కిసగోతమి

మరణముండని స్థితిని
ఎరుగ లేకుండగ
నూరేళ్ళు బ్రతకడం కన్న
మరణంబు లేని స్థితి
నిర్వాణపథమని
ఎరిగి ఒక రోజైన
బ్రతుకుటే మిన్న. 15

జేతవనం- బహుపుత్రిక
(వృద్ధ భిక్షురాలు)

ఉత్తమ ధర్మం తెలియక
వందేళ్ళు బ్రతుకుటేల?
ఉత్తమ ధర్మం తెలిసి
ఒక్క రోజు బ్రతుకు చాలు. 16



# 9. పాప వర్గం

పాపం అంటే చెడు. చెడు పనుల దుష్ఫలితాలు, మంచిపనుల సత్ఫలితాలు వివరించబడ్డాయి.

శుభ కార్యముల శీఘ్రముగ జేయవలయును — జేతవనం-ఏకసాటకుడు (బ్రాహ్మణుడు)
చెడు నుండి చిత్తాన్ని వారించవలయును,
పుణ్యము చేయుటలో *తన్ద్రితంబైనచో (*అజాగ్రత)
పాపమందున మనసు రమించజొచ్చును. 1

ఎప్పుడేని పాపకార్యంబు జేసినా — జేతవనం-సేయ్యసకుడు (వృద్ధ భిక్షువు)
మరలమరల దాన్ని ఒనరింపగారాదు
పాపకృత్యము నందు ఆసక్తి కూడదు
పాపసంచయముకడు దుఃఖ కారణము. 2

ఎప్పుడేని పుణ్య కార్యంబు జేసినా — జేతవనం-లాజదేవునికన్య
మరల మరల దాన్ని ఒనరింపవలయు
పుణ్యకార్యము నందు ఆసక్తి పెంచుము
పుణ్యసంచయము కల్గించును సౌఖ్యము. 3

పాపిసైతము సుఖముపొందుచూ ఉండు — జేతవనం- అనాథ పిండికుడు (వ్యాపారి)
పాపము పండక ఉండేంత వరకు
పాపంబు పరిపక్వతను చెందినంతనే
పాపఫలమాతని పట్టి పీడించును. 4

పుణ్యాత్ముడు కూడ దుఃఖాన్ని పొందు
పుణ్యము పండక ఉండేంతవరకు
పుణ్యము పరిపక్వతను చెందినంతనే
పుణ్యఫలమాతని సుఖియింపజేయును. 5

"నన్నేదీజేరద"ని చింతించరాదు
పాపమును అశ్రద్ధ చేయగరాదు
నీటి బొట్టొక్కొకటి నింపదాకుండను
మూఢుడటు మెలమెల్ల పాపముతోనిండును. 6

జేతవనం-అసంయమి (భిక్షువు)

"నాకేదీదక్కద" ని చింతించ రాదు
పుణ్యమును అశ్రద్ధ చేయగరాదు
నీటి బొట్టొక్కొకటి నింపదాకుండను
ధీరుడటు మెలమెల్ల పుణ్యముతో నిండును. 7

జేతవనం- విలాలపాదుడు (వ్యాపారి)

కొద్దిరక్షణ గొప్పధనముతొ
వణిజుడు భయమార్గమును విడు
జీవితము నందాశపడుచు
విషమును విడనాడు నట్లు
మనుజుడు జీవింపగోరి
పాపమును త్యజియింపవలెను. 8

జేతవనం- మహాధనుడు (వర్తకుడు)

వ్రణం లేని చేతిని
విషమేమీ చేయలేదు
వ్రణంలేని వానికి
విషమంటనియట్లు
చెడు చేయనివానిని
పాపమేమిచేయలేదు. 9

వేణువనం- కుక్కుటమిత్తుడు

గాలివీచు వైపు నకును
దుమ్ముమవిసిరిన తిరిగివచ్చు
నిర్మలునికి శుద్ధమతికి
హానికలుగ జేసినా
హానిజేసిన మూర్ఖునే
చుట్టు కొనును పాపము. 10

జేతవనం- కోకుడు (కుక్కలను వేటాడు వాడు)

జేతవనం- (మాణికారకులూపగ)
తిస్సుడు (వృద్ధ భిక్షువు)

గర్భమున కొందరు
జొరబడుచునున్నారు
నరకమున పాపులు ప్ర-
వేశించుచున్నారు
స్వర్గమున కేగేటి
పుణ్యజనులున్నారు
మలినరహితులు చనును
నిర్వాణమునకు 11

జేతవనం- ముగ్గురు
భిక్షువులు

ఆకాశ పర్వత సముద్రాలయందు
పాపాత్ముడెచటేని దాగియుండినను
పాపఫలముల నుండి తప్పించుకో లేడు
పాపఫలమును దాచుస్థలము జగతిని లేదు. 12

కపిలవస్తు (న్యగ్రోధారామము)-
సుప్పబుద్ధుడు (శాక్యుడు)

ఆకాశ పర్వత సముద్రాల యందు
మానవుండెచ్చోట దాగి యుండినను
మృత్యు ముఖము నుండి తప్పించుకోలేడు
మృత్యువును దాచేటి స్థలము జగతిని లేదు. 13



జీవితంలో
ఉత్తమ పథం
'దమ్మపదం'

# 10. దండవర్గం - శిక్ష

ఈటెల వంటి మాటలు, దుష్టచర్యలు హింసతో కూడినవనీ హాని కలిగిస్తాయని చెప్పడం. దండం అంటే కర్ర, శిక్ష.

కర్రను జూసి ఒణుకుతారు — జేతవనం-ఛవ్వగ్గియం (భిక్షుసముదాయం)
మరణమంటే భయపడతారు,
అందుచే ఇతరుల తనవలె జూచి
దండించకు దండింపజేయకు. 1

దెబ్బంటే జంకుదు రందరు
ప్రాణమంటే మహా ప్రీతి
కాన ఇతరుల తనవలె జూచి
దండించకు, దండింపజేయకు. 2

జీవులకు సహజము — జేతవనం-అనేకబాలురు
సౌఖ్యమందా సక్తి
స్వీయ సుఖమాశించి
జీవులను దండించి
ఎవ్వడు వధించునో
వాడు పొందడు సుఖం
మరణాంతమందునను. 3

జీవులకు సహజము
సౌఖ్యమందు ఆసక్తి,
సొంత సుఖం ఆశించి
జీవులను దండంచే
ఎవ్వడు వధించడో
పొందునతడు సుఖం
మరణాంతమందునను. 4

పలుకవద్దు పరుషంగా
పరుషమె బదు లౌ నీకు
పరుషవాక్కు బాధ నిచ్చు
ప్రతి దండన కొని తెచ్చు.

జేతవనం- కుణ్డధానుడు
(వృద్ధభిక్షువు)

5

విరిగిన ఓ గాజు ముక్క
తీరున మౌనం పూను
నిర్వాణపథం నీకు
నిక్కముగ అబ్బినట్లె
నీలో ఏ మాత్రము
కలహానికి తావులేదు.

6

కర్ర బట్టి గోపాలుడు
గోవులను తోలుకొని పోవు నట్టి రీతిని
ముసలితనం పేర మృతి
ప్రాణుల ఆయువు గొని చను.

శ్రావస్తి (పూర్వారామం)-
విశాఖాదులు
(ఉపాసకు రాండ్రు)

7

దురిత కర్మలు చేయు మూర్ఖ మానవుడు
దుష్ట స్వభావంబు తెలిసికోలేడు
దావాగ్నిలో బడి దహనమౌ వానివలె
దుష్ట కర్మల చేత తగలబడి పోవు.

రాజగృహ (వేణువనం)-
అజగరుడు (ప్రేత)

8

నిరపరాధుల బట్టి కొరవేయువానికి
నిర్దోషులను దోషులుగ మార్చువానికి
పది దండనలలో ఏదో ఒకటి తప్పదు;

రాజగృహ- మహామోగ్గలానుడు
(వృద్ధ భిక్షువు)

9

తీవ్రవేదన, హాని, అంగవైకల్యం
క్షోభ, తీరని వ్యాధి, రాజదండనము
భోగ క్షయం, బంధునాశనం, నింద,
గృహదహంబుతో పది-తుదకు నరకం.

10,11,12

జేతవనం- బహుభత్తికుడు
(భిక్షువు)

కాంక్షలుడుగనివాడు
కావిగట్టిన కూడ
కడు దిగంబరియైనా
జడలను ధరించినా
బూడిదను పూసినా
కడుపు మాడ్చేసినా
కటిక నేల పరుణ్ణా
ఒడలంత ధూళైనా
కఠిననియమాలున్నా
శుద్ధుడు కాలేడు. 13

జేతవనం - సన్తతి
(మహామాత్త్య)

అలంకృతుడైనను
అనవరతశాంతుడై
అంతర్బహిర్గత
ఇంద్రియ వినిగ్రహుడై
నియమాల నిష్ఠుడై
నిజబ్రహ్మచారియై
సకల భూతము లందు
సదయుడైయున్నచో
సద్బ్రాహ్మణశ్రమణసభిక్షువతడు. 14

జేతవనం- పిలోతికుడు
(వృద్ధ భిక్షువు)

కొరడా దెబ్బకు
వెరచు గుఱ్ఱమటు,
సిగ్గుకు జంకి
చెడును చేయడు,
ఉత్తమ అశ్వం
మాదిరి యతడు
ఒరుల నిందను
సహింప జాలడు. 15

కొరడా తగిలిన
గొప్ప వాజివలె
ప్రయత్నించి
దుఃఖం విడనాడు;
శ్రద్ధ-శీలం-వీర్యం-సమాధి
ధర్మధృతి - నిశ్చయబుద్ధి
విద్యా చరణ - మంచి స్మృతియున్న
దాటిపోవును ఘోర దుఃఖమును. 16

నిపుణులు నీటికి దారులు చేతురు
కమ్మర్లు శరం తిన్నగజేతురు
వడ్రంగులు సరిజేతురు చెక్కను
సువ్రతులు తామే అదుపవుతారు. 17

(ఇదే విషయం పండిత వర్గంలో 5 వ గాథలో చెప్పబడింది)



**మంచి జీవితం**
**కోరేవారికి**
**ధమ్మపదానికి**
**మించినదిలేదు.**

# 11. జరావర్గం - వృద్ధాప్యం

దేహం అశాశ్వతం. ముసలితనం ఖాయం. ఇది సహజం. కనుక యౌవనంలోనే ధర్మాచరణ మొదలవ్వాలి. వృద్ధాప్యంలో పశ్చాత్తాపపడ్డా ప్రయోజనంలేదు. 9వ గాథను బుద్ధుడు జ్ఞానోదయానంతరం ఆనందపారవశ్యంలో పలికాడు.

జేతవనం - విసాఖ మిత్రురాలు

నిత్యం నిప్పులు సెగలేస్తుంటే
హాస్యమేటికానందమేటికి?
అంధకారమున చిక్కిన నీవు
ప్రదీపానికైవెదక వెందుకు? 1

రాజగృహ-సిరిమా

ఎంత చిత్రమో
ఏమీ దేహం
ఎన్ని వాపులో
ఎన్ని వ్రణాలో
ఎన్ని క్లేశాలో
ఎంచగ నశ్వరం
క్షణికమ స్థిరం. 2

జేతవనం- ఉత్తరి (వృద్ధ భిక్షురాలు)

ఈ దేహం జీర్ణగృహం
శిధిలం క్షణభంగురం
రోగాలతోనిండి, కుళ్ళు
భాగాలతో కూడినది;
కృశించేది, నశించేది
చివరికంతరించేది. 3

జేతవనం- అధిమానుడు (భిక్షువు)

పనికిరానట్టిది పథ్యానికైన,
బయట విసిరేయబడు శరదృతువునందు

సొరకాయ వంటిదీదేహంబుజూడ,
పావురం వలె తెల్లటెముకలు కల్గిన
దేహాన్ని జూచెవరు ప్రీతి జెందుదురు. 4

ఎముకలతో అల్లినాము
మాంసంతో నేసినాము
రక్తంతో పూసి నింపి
నిర్మించామో నగరం;
వైరంతో పెరిగింది
గర్వంతోమరిగింది
జరామరణములు జేరి
శరీరాన్ని వశం జేసె. 5

జేతవనం- రూపనన్దా
(వృద్ధ భిక్షురాలు)

మహారాజ రథాలైన
మట్టి పాలు అవుతున్నాయ్
దేహం కూడా అటులే
వార్ధక్యం పాలవును,
సజ్జనుల ధర్మానికి
జరావ్యాధులు లేవు
సజ్జనుల మాటిది
సజ్జనుల గురించి. 6

జేతవనం- మల్లికా దేవి

బుద్ధిబలం వృద్ధికాదు
అల్పజ్ఞునికి
కండరాలు పెరుగుతాయి
మెండుగాను అతనికి
పశువులాగ వుంటాడు
కృశించి క్షీణిస్తాడు. 7

జేతవనం-ఉదాయి
(వృద్ధ భిక్షువు)

సుళ్లు తిరుగుతూ పోతిని సాంసారిక జన్మల్లో
మళ్ళీ మళ్ళీ వెదికితి మన గృహ నిర్మాతకై
కనపడలేదతని జాడ కడకు పడితి దుఃఖంలో
ఓ గృహకారా! నీ
విప్పుడు కనబడ్డావు,
ఇంక నీవు నాగృహం
నిర్మించగలేవు
చేపట్టిన పరికరాలు
చెడి పడి పోనాయి
ఇంటి కప్పు దూలం
ఇదె బ్రద్దలయింది
తృష్ణ తొలిగిపోయింది
నిర్వాణంనిలిచింది. 8,9

వారాణసి (ఋషిపత్తనం)- మహాధనికుడగు ఒక వణిజాని పుత్రుడు

బ్రహ్మ చర్యాన్ని పాటించలేనోళ్ళు
యౌవనాన ధనం ఆర్జించలేనోళ్ళు
చేపలు లేనట్టి చెరువులోనున్న
కప్పలాగ కుంది క్షీణించి పోతారు. 10

బ్రహ్మ చర్యాన్ని పాటించలేనోళ్లు
యౌవనంలోధనం ఆర్జించలేనోళ్ళు
కూలిన బాణాల ప్రక్కపై వానివలె
గతజీవితం తలచి వెత జెందుతారు. 11



## 12. ఆత్మవర్గం (తనకుతాను)

ఆత్మ అంటే జీవాత్మ, పరమాత్మకాదు. బుద్ధుడు శాశ్వతమైన ఆత్మను అంగీకరించలేదు. ఆత్మఅంటే స్వకీయమైన,తనదైన అని అర్థం. దేహం, ప్రాణం, మనసు, అహం-అన్నీకలిపి ఆత్మ. కొంతకాలానికి అదిపోతుంది. అదియే నైరాత్మ్య (అనాత్మ)భావన.

తనకు తాను ప్రియమ్మని తనకు తెలిస్తే
తనను తాను లెస్సగ రక్షించు కొనాలి
మూడు జాముల ఒక్క జామైన మేల్కొని
మంచి తెలివితో జ్ఞాని సంచరించాలి. 1

సుంసుమారగిరి (భేసకలావనం)- బోధి రాజకుమారుడు.

తనకు తాను ధర్మంలో ముందు స్థిరపడాలి
తరువాత ధర్మాన్ని తదితరులకు చెప్పాలి
తనకు క్లేశము ఉండదు, వినయంగ వింటారు,
ఘనత పెరుగుతుంది, ఇది జ్ఞానులు చేసేపని. 2

జేతవనం- (శాక్యపుత్రుడు) ఉపనందుడు (వృద్ధ భిక్షువు)

తది తరులకు తాజెప్పే రీతిని
తాను ముందుగ నడవాలి,
తనకు తాను ముందదుపు జేసుకొని
తది తరుల నదుపు చేయాలి
ఆత్మదమనము అతి కష్టముసుమా. 3

జేతవనం- (అభ్యాసి) తిస్సుడు (వృద్ధ భిక్షువు)

తనకు తానే ప్రభువు
ఇతరు డెట్లవుతాడు?
ఆత్మ నిగ్రహముంటే
అయినట్లు తా ప్రభువు
తానట్టి ప్రభువగుట
దుర్లభంబే సుమా. 4

జేతవనం- కస్సపకుమారుని తల్లి (వృద్ధ భిక్షురాలు)

తననుండి తన వల్ల
తనకుపుట్టిన పాపం
వజ్రమణికొనలాగ
వేధించు చెనటిని

జేతవనం- మహాకాలుడు
(ఉపాసకుడు)

5

'మాలువా' లతచుట్టిన
సాల వృక్షము వోలె
వైరి కోరే రీతి
తనకు తా దుర్మతి
తనదు దుర్గుణములతో
చెడు చేసుకుంటాడు.

జేతవనం- దేవదత్తుడు

6

అహితమసాధుత్వ
క్రియచేయ సులభము,
హితము సాధుత్వమగు
పనిజేయ కష్టము.

రాజగృహ (వేణువనం)- సంఘమున
కలత జనించిన సందర్భమున

7

హీన దృష్టిని కుమతి
కాని మాటనును
అర్హతుల, ఆర్యుల
ప్రబోధాలు నిందిస్తు
ధర్మాత్ములకు చేటు చేస్తాడు;
వెదురు విత్తులు చెదిరి
పడిపోయినట్లుగా
తనకు తానే చితికి పోతాడు.

జేతవనం- కాలుడు
(వృద్ధ భిక్షువు)

8

తనకు తానే చేసుకుంటాడు చెడును
తనకు తానే మలిన పడుతాడుఅతడు
తనకు తానే చెడును తొలిగించుకోవాలి

జేతవనం- కాలుడు
(ఉపాసకుడు)

తనకు తానే శుద్ధి జేసుకోవాలి
ఎన్నగ శుద్ధియునశుద్ధియు వేర్వేరు
తనకు వేరెవ్వరు శుద్ధి చేయగ లేరు. 9

హాని జేసుకోరాదు — జేతవనం- అత్తదత్థుడు (వృద్ధ భిక్షువు)
ఒరుల పనులకొరకు,
మేలు చెరుచుకో రాదు
పరుల మేలు కొరకు,
నీమేలును జూసుకొని
పరులకు మేల్జేయి.
జరగాలి ధర్మంగా
పరులకు ఏమేలైనా. 10



## *13. లోకవర్గం*

లోకంలో ప్రజలు అర్థం పర్థంలేని విశ్వాసాలతో ఉన్నారు. అవి అనుచితాలు, అసంబద్ధాలు, అహేతుకాలు అని చెప్పబడ్డాయి. సద్ధర్మమొక్కటే ఆశ్రయించతగింది అని బోధించడం జరిగింది.

హీనధర్మం నీకు వద్దు — జేతవనం- అల్పవయస్కుడగు ఒక భిక్షువు
ప్రమాదంగా బ్రతకవద్దు
మిధ్యా దృష్టిని వదిలిపెట్టు
లోకవైఖరి వృద్ధి జేయకు. 1

లేలే, పడకుము ప్రమాదంలో — కపిలవస్తు(న్యగ్రోధారామం)- సుద్ధోధనుడు
రారా, ధర్మాచరణంలోకి
ధర్మ పరుడు ఈ లోకంలో
మరులోకంలోనూ సుఖనిద్రపొందు. 2

మంచి ధర్మం ఆచరించు
చెడ్డ ధర్మం ఆచరించకు
ధర్మవంతుడీ లోకంలోను,
మరులోకంలోనూ సుఖనిద్రపొందు. 3

జేతవనం-500
జ్ఞానులు (భిక్షువులు)

నీటి బుడగలా
ఎండ మావిలా
ఈ లోకాన్ని
చూసేవానికి
మృత్యువు చూపు సోకదు. 4

రాజగృహ (వేణువనం)-
అభయ రాజకుమారుడు

వచ్చి చూడు ఈ లోకాన్ని
విచిత్ర రాజ మార్గంలా
అజ్ఞానులకందాసక్తి
జ్ఞానులకు లేదు ఆసక్తి. 5

జేతవనం- సమ్మ్మజ్ఞాని
(వృద్ధ భిక్షువు)

ప్రమాదంలో పడినప్పటికి
పిదప జాగ్రత్త పడిన వాడు
మబ్బు వీడిన చంద్రుని వోలె
మహిలో ప్రకాశమిస్తాడు. 6

జేతవనం - అంగులిమాలుడు
(వద్దభిక్షువు)

కుశల కర్మల తోడ
పాప కర్మల నెవడు
పూర్తిగా కప్పునో
మబ్బు వీడిన యట్టి
చంద్రుని మాదిరిగ
లోకాన్ని వెలిగింపజేస్తాడు. 7

గుడ్డిది ఈలోకం-దాన్ని
చూడగల్గిన వారెవరు?

వలనువీడిన పక్షిలాగ
కొలది మంది చూడవచ్చు
స్వరానికి వారు పోతారు. 8

పోవును హంసలు సూర్య మార్గమున — జేతవనం-ముప్పది భిక్షువులు.
పోదురు మనుజులు వ్యోమపథమున
యోగ బలంతోడై వుండ;
మారుని ఆతని సేనను జయించి
ధీరులు పోదురు లోకాంతరమున. 9

ధర్మాన్ని దాటినవాడు — జేతవనం-చించ.
అబద్ధాలు ఆడేవాడు
పరలోకంగూర్చి ఏమీ
యోచించగలేనివాడు
చేయలేని చెడ్డ పని, చూడ ఒక్కటుండదు. 10

లోభులు పోలేరు — జేతవనం- అయుక్తమగు దానం గూర్చి
దేవలోకాలకు ఎప్పుడు,
మూఢులు పొగడరు
దాన-ధర్మాలను ఎన్నడు,
ధీరుడు వాటితో తృప్తి
పొందుతాడు నిరతము
ఆతని సుఖమే సుఖము
ఇక్కడైన పరమందున 11

భూలోక పాలవ కన్నా
స్వర్గలోక మేగుట కన్నా
సర్వలోక నియంత్రణ కన్నా
సోతాపత్తి (అర్హతుని) ఫలితం మిన్న. 12

# 14. బుద్ధవర్గం

బుద్ధులు జ్ఞాన సిద్ధి పొందినవారు. జ్ఞానిలక్షణాలు వర్ణించారు. నిర్వాణ సత్యాలు, మార్గాలు బోధించారు.

ఉరువేల- మాగన్దియడు (బ్రాహ్మణుడు)

ఎవరి విజయాని కెన్నడు తిరుగులేదో
ఎవరికామన విడిపోయి తిరిగిరాదో
ఎవరి కోరిక మలి తిరిగ చేరరాదో
అతని పదమనంతమగోచరంబు
అట్టి బుద్ధుని ఏదారి చేరగలరు? 1

విషరూపమగు తృష్ణ
వశమెవని చేయదో,
అట్టి బుద్ధుని పదమగోచరంబు
అట్టి బుద్ధుని పదమనన్త మౌను
అట్టి వానిని నీ వెటుల పొందగలవు! 2

సంకాశ్యనగరం- దేవ, మనుజులు

ధ్యాన మందును మరియు/ నిర్వాణమందు
శాంతి అనందముల / నెవరు పొందుచుంద్రో
అట్టి బుద్ధుల పట్ల దేవతలు కూడ
పొందుచుందురు/ ప్రీతిని డెంద మందు. 3

వారాణసి- ఏరకపత్తుడు (నాగరాజు)

దుర్లభం మానవుల జన్మ
దుర్లభం మర్త్యుల జీవితం
దుర్లభం సద్ధర్మ శ్రవణం
దుర్లభం బుద్ధుల పుట్టుక. 4

జేతవనం- ఆనందుడు (వృద్ధ భిక్షువు)

చెడును చేయకుమెంచి
అభ్యసించుము మంచి
చిత్తమును కడిగుంచు
బుద్ధులిటు ప్రవచించె. 5

బుద్ధులీ విధిన్ గొప్పగ జెప్పిరి
ఓర్పు ఉండడం పరమ తపస్సు
సహనముండడం పరమవిముక్తి.
పరులకు పీడన చేసే వాడు
పరగప్రజితుడుకాతగడు
పరులనవమాన పరిచేవాడు
సరిగ శ్రమణుడు కాలేడు. 6

అవమానం కలిగించరాదు
హాని చేయ రాదెన్నటికి
నియమపాలన* జేయాలి (* ప్రాతిమోక్షం)
ఆహార నియతి పాటించాలి
ఏకాంత వాస ముండాలి
మనసును నిశ్చల పరచాలి
ఇదేబుద్ధుల ఆదేశం. 7

జేతవనం- చిన్తా క్రాంతుడగు ఒక భిక్షువు

కామం తీరదు కనకం
వర్షంబై కురిసినా
కామం వల్లను కలిగే
దుఃఖం బహు ఎక్కువ
కాయం వల్ల కలిగే
సౌఖ్యం చాల తక్కువ
ఇది గ్రహించిన విజ్ఞులు
ఇది గ్రహించిన బుద్ధులు
ఇది గ్రహించిన శ్రమణులు
వీక్షింపరు భోగాలు
వీక్షింతురు తృష్ణా క్షయం. 8,9

| | |
|---|---|
| భయం తరుము తుంటే మనిషి<br>పర్వతాలను ప్రార్థిస్తాడు<br>పవనాలను వినుతిస్తాడు<br>వృక్షాలను పూజిస్తాడు<br>ఆరామాలు శరణంటాడు<br>చైత్యాలను శరణంటాడు<br>దేనినెటుల శరణు పొందినా<br>లేదు భద్రతఎందు లోననూ<br>కాదెన్నటికవి సర్వోత్తమములు<br>అవికల్గించునుతనకు దుఃఖము. | జేతవనం- అగ్గి దత్తుడు<br>(బ్రాహ్మణుడు)<br><br><br><br><br><br><br><br>10,11 |
| బుద్ధుని శరణం పొందిన వాడు<br>ధమ్మం శరణం పొందిన వాడు<br>సంఘం శరణం పొందిన వాడు<br>సమ్యక్ జ్ఞానం సంపాదించి<br>చూస్తాడు చతురార్యసత్యములు;<br>దుఃఖ ముందని, కారణముందని<br>నివారణుం దని చూస్తాడు<br>దుఃఖ నివారణ మార్గం బైన<br>అష్టాంగ పథము చూస్తాడు<br>ఈ శరణం సంక్షేమ కరం<br>ఈ శరణం సర్వోత్తమము<br>త్రి శరణాలను పొందిన వాడు<br>సర్వదుఃఖాల నుండి ముక్తుడౌ. | జేతవనం- అగ్గిదత్తుడు<br>(బ్రాహ్మణుడు)<br><br><br><br><br><br><br><br><br><br><br>12,13, 14 |
| ఉత్తముడు పుట్టడం దుర్లభం<br>ఎక్కడ బడితే అక్కడ పుట్టడు<br>ఎక్కడ ధీరుడు జన్మిస్తాడో<br>ఆకుటుంబం సుఖమయం. | జేతవనం- ఆనందుని<br>ప్రశ్నకు<br><br>15 |

జేతవనం- పలువురు భిక్షువులు

సుఖదాయకము బుద్ధుల జన్మ
సుఖదాయకము ధర్మ ప్రబోధం
సుఖదాయకము సంఘ సమైక్యత
సుఖదాయకము సమైక్య తపస్సు. 16

పూజనీయులగు బుద్ధులను,
ప్రీతిజెందు బుద్ధాను యాయులను,
లోకాన భయ శోకాల
ఏకంగా అవరోధాల
దాటిపోయినవారలను,
శాంతులనూ నిర్భీతులనూ,
పూజించిన సౌభాగ్యం కల్గు
పూజించిన బహు పుణ్యం కల్గు
పుణ్యం కొలతల కందనిది. 17,18



**ధమ్మపదం**
**అర్థమైతే**
**ఉత్తమజీవితం**
**అబ్బుతుంది**

## 15. సుఖవర్గం

నిజమైన ఆనందాన్ని వర్ణిస్తాడు. అందుకు అనుసరించాల్సినవి చెపుతాడు. నిబ్బణం అత్యున్నతమైంది. విజయంలో ఎదుటివాణ్ణి దుఃఖం పాలు జేయడం ఆనందం కాదని 5వ గాథలో చెపుతాడు.

శాక్యనగరం - జాతికలహోపశమనార్థం

వైరుల మధ్యైనా
అవైరంగా ఉంటూ
సౌఖ్యంగా జీవించు;
వైరులమధ్య మనం
అలా సంచరిద్దాం. 1

ఆదుర్దా పరుల మధ్య
ఆదుర్దా లేకుండగ,
సౌఖ్యంగా ఉండు;
ఆతురత జనంమధ్య
ఆతురత లేకుండగ
అలా మనం చరిద్దాం. 2

ఆసక్తులు చుట్టున్నా
అనాసక్తిగా ఉంటూ
సౌఖ్యంగా ఉండు;
ఆసక్తుల మధ్య మనం
అనాసక్తిగా తిరిగెదం. 3

పంచసాల (బ్రాహ్మణగ్రామం, మగధ)- మారుడు

ఏమీ లేకున్నా
(లేనివాళ్ళవలెగాక)
సౌఖ్యంగా ఉండు;
వెలుగు దేవతల్లాగ (ఆభాస్వర దేవతలు)
భక్షిస్తున్నాం సౌఖ్యం. 4

వైరం పుట్టును విజయంవల్ల — జేతవనం- కోసలరాజు
పరాజితుడు దుఃఖిస్తాడు,
జయాపజయాలు విడనాడి
ఉపశాంతినిపొందేవాడు
సౌఖ్యంగా నిదురిస్తాడు. 5

కామానికి సరితూగదు అగ్ని — జేతవనం- ఒకానొక కులకన్య
ద్వేషానికి సరితూగదు నేరం
స్కంధానికి సరితూగదు దుఃఖం
శాంతికి సమమౌ సౌఖ్యం లేదు. 6
(స్కంధం=దేహం, సముచ్చయం, సంస్కారం)

ఆకలనేదొక పెద్ద రోగము — అలవి - ఒక ఉపాసకుడు
సంస్కారం అతిదుఃఖం
అని జ్ఞానం కల్గినవానికి
నిర్వాణం సర్వోత్తమ సౌఖ్యం. 7

గొప్ప లాభము ఆరోగ్యం — జేతవనం - పసేనది కోసలరాజు
గొప్ప సంపద సంతృప్తి
గొప్ప బంధువు విశ్వాసం
గొప్ప సౌఖ్యము నిర్వాణం. 8

ఉత్తమ వివేక ముపశమనంబను — వైశాలీ - తిస్సుడు (వృద్ధభిక్షువు)
రసాలను గ్రోలిన వాడు
నిర్భయుడై జీవించు,
ధర్మ ప్రీతి రసంబును
పానం జేసిన వాడు
పాపరహితుడగును 9

ఆర్యుల సాధుల దర్శనం
వారల సన్నిధి సదాసుఖం
మూర్ఖుల దర్శనం లేకుంటే
నిత్యం సౌఖ్యం కలుగును. 10

వేలువగ్రామం( వైశాలీ సమీపమందలి
వేణువ (గ్రామం)-
సక్కుడు(దేవరాజు)

మూర్ఖులతో వసించువాడు
దీర్ఘకాలం శోకిస్తాడు
మూర్ఖుల సహవాసం జేస్తే
అమిత్రులతోనున్నట్లే
సర్వదాదుఃఖంకల్గును,
ధీరుల సహవాసం చేస్తే
కోరిన చుట్టాల్ చేరిన రీతి
కరమున అమరును సౌఖ్యం. 11

ధీరుని- ప్రాజ్ఞుని - ఆర్యుని
బహు శ్రుతుని - వ్రతనిష్ఠుని
బుద్ధిమంతు - సత్పురుషుని
యత్నశీలుడైన వాణ్ణి
నక్షత్రపు మార్గాన
నడయాడు చంద్రునిగా
సేవించాలి సతతం
(సన్మానించాలి చేరి.) 12

వేలువ గ్రామం-
సక్కుడు(దేవరాజు)



సిద్ధాంత బౌద్ధం చిక్కుల్లో పెడుతుంది
'ధమ్మపద' పాలనం జీవితాన్నిస్తుంది.

# 16. ప్రియవర్గం

ప్రియం అంటే ఇష్టం, కామం, వ్యామోహం, తృష్ణ అనే అర్థంలో చెపుతాడు. ఆ భావనలు దుఃఖహేతువు లంటాడు.

తగని దాని వెంటపడి
తగిన దాన్ని కాదంటూ
*అర్థాన్ని విడనాడి (*సరైన అర్థాన్ని)
ఆనందం వెంట పడుతు
ఆసక్తుల జూసివాడు
అనుకూలుడు అవుతాడు. 1

జేతవనం- ముగ్గురు భిక్షువులు

(ప్రియాసక్తి - లోకాసక్తి - కలవాడు ప్రియాసక్తులపట్ల అనుకూలుడూ కావచ్చు, ఈర్ష్యాళువూ కావచ్చు.)

ప్రియమందూ అప్రియమందూ
లయమై పోవద్దాసక్తిన్
ప్రియమైనది కనుమరుగైన
ప్రియంకానిది కనపడినా
ప్రాప్తిలు దుఃఖం ఇరుతెరగులుగ. 2

భావన చేయకు ప్రియమని దేనిని
పడకు భ్రమలోన ప్రియమను కొంటూ
విడిపోయిననూ దుఃఖం వాటిలు
ప్రియాప్రియాలువదలిన వానికి
విడిపోతాయిబంధాలు. 3

ప్రియం వల్ల శోకం కల్గు
ప్రియంవల్ల భయమూ కల్గు
ప్రియమునందు ఆసక్తి వదిలతే
శోకమే లేదు దుఃఖ మెక్కడిది?

జేతవనం- ఒకానొక గృహస్థుడు

రాగం వల్ల కలుగును దుఃఖం — జేతవనం- విశాఖ (ఉపాసకురాలు)
రాగం వల్ల పుట్టును భయం
రాగం వదలిన లేదు దుఃఖం
రాగం వదలితే భయమెక్కడిది? 5

భోగాసక్తిని జనించుశోకం — వైశాలీ (కూటాగార శాల)- లి(వి)చ్ఛవులు
భోగాసక్తిని జనించు భయము
భోగా సక్తిని విడిచిన వానికి
శోకం లేదు భయమెక్కడిది? 6

కామం వల్ల కల్గును శోకం — జేతవనం- అనిత్థిగన్ధకుమారుడు
కామం వల్న కల్గను భయం
కామం నుండి విముక్తి కల్గితే
శోకం లేదిక భయమెక్కడిది? 7

తృష్ణ వల్ల పుడుతుంది శోకం — జేతవనం- ఒకానొక బ్రాహ్మణుడు
తృష్ణ వల్ల పుడుతుంది భయం
తృష్ణ తొలిగితే శోకం లేదు
తృష్ణ తొలిగితే భయ మెక్కడిది? 8

ప్రజల కెవ్వడు చాల ప్రియమైనవాడు? — రాజగృహ (వేణువనం)- 500 బాలురు
శీల సంపద ధర్మ నిష్ఠ గలవాడు
ప్రజల కెవ్వడు మిగుల ప్రియమైనవాడు?
లోని జూపు సత్య వాణి కల వాడు
ప్రజల కెవ్వడు కడు ప్రియమైన వాడు?
తనదు బాధ్యతలందు నిరతుడగువాడు. 9

నిర్వచింప వీలులేని — జేతవనం- అనాగామి
నిర్వాణం కోరువాడు
నిశ్చయస్ఫురణున్నవాడు

నిష్కామచిత్తుడై
నిర్నిబద్ధుడైనవాడు
నిర్ణయించబడినాడు
ఊర్ధ్వస్రోతుండని
(నిక్కముగ ప్రవాహో
న్నెదిరించేవాడని). 10

ఋషిపత్తనం- నన్దిపుత్తుడు

చిరకాలముగా నెచటో
జీవించిన సుప్రవాసి
సుఖముగ సంక్షేమంగా
స్వగ్రామం తిరిగి రాగా
స్వజనులు స్నేహితులెల్లరు
స్వాగతింత్రు ఆర్ద్రముగ. 11

లోకాన్ని వదలి-వే
వేరెచటికి వెళ్లినా
సుకృతుని బంధువులు
స్వాగతించునట్లు
సుకృతాలే ఆతని
స్వాగత సుమాంజలి. 12



# 17. క్రోధవర్గం

క్రోధం అనగా కోపం. అది ఉప్పొంగి ఆవేశంతో బయటికి వస్తుంది. మనోనిగ్రహం ద్వారా కోపాన్ని అదుపు చేయాలి. నింద, పరుషోక్తి, ఉద్రేకం హానికరం. మానసిక శారీరకప్రకోపాలను జయించాలని చెప్పాడు.

కపిలవస్తు - రోహిణి

క్రోధమును త్యజియించవలెను
గర్వమును విడనాడవలెను
సర్వబంధము లధిగమించిన
నామరూపములను విదల్చిన
తనదికానిది మనసుకోరని
వానిని దుఃఖంబుతాకదు. 1

అలవీ (అగ్గాలవ చైతన్య)- ఒకానొక భిక్షువు

వేగిరముగా బోవు
రథము నాపేటట్లు
ఉప్పొంగు క్రోధమును
నిగ్రహించు వాడు
నిజమైన సారధి గ
నేనతని తలతు,
ఇతరులు కేవలం
కళ్లెముల బట్టుదురు. 2

రాజగృహ-ఉత్తర (ఉపాసకురాలు)

అక్రోధముచే క్రోధం
సాధుత్వంచే చెడును
దానంచే కృపణత్వం
సత్యంతో అసత్యము
జయించుము, జయించుము. 3

జేతవనం- మహామొగ్గ లానుడు (వృద్ధ భిక్షువు)

సత్యమును బల్కుము
కోపమును పూనకు

నీకున్న కొలదిలో
అడిగినది ఇవ్వుము
మనుజుడీ మూటితో
జేరును దేవతల. 4

సాకేత (అయోధ్య)-
ఒకానొకబ్రాహ్మణుడు

సంయమం, అహింస
పాంటించువారలు
క్షయము దుఃఖము లేని
నిబ్బణం పొందుదురు. 5

రాజ గృహ (గృధ్రకూటము)-
శ్రేష్ఠికుమారుడు

నిరతము జాగృతి గల్గి
అహోరాత్రముల శిక్షణ
పొందినట్టి వారలకు,
నిర్వాణప్రాప్తి నొంది
ముక్తులైన వారలకు
మనసున మాలిన్యాలు
సంపూర్తిగ నశించును. 6

జేతవనం- అతులుడు
(ఉపాసకుడు)

వెనుకటి సంగతి 'అతులా'
ఇప్పటిదీ మాట కాదు-
మౌనంగా నున్న వాని
ఎక్కువ మాట్లాడువాని
నిందిస్తూ ఉంటారు
లోకంలో నిందలకు
లోనుకాని వాడు లేడు. 7

భూత భవిష్యతులలోన
గత కాలంలో నైన
ప్రస్తుత కాలం లోన

పూర్తిగ నిందితుడుగాని
పూర్తిగ వందితుడు గాని
లేనేలేడు, మరి
రాబోయే కాలంలో
ఉండడు గాకుండడు. 8

అంతర్యంబున విజ్ఞులు — జేతవనం- అతులుడు (ఉపాసకుడు)
నిరంతరము విచారించి
దోషరహితుని, (వి) బుధుని
ప్రజ్ఞానిని సౌశీల్యుని
ప్రస్తుతింతురు,
బాగా ప్రశంసింతురు. 9

స్వర్ణం వలె వెలుగొందే
నిర్మల చిత్తుని ఎవరు
నిందించ సాహసింత్రు?
దేవతలు ప్రశంసింతురు
బ్రహ్మసైతము స్తుతించు. 10

శారీరక ప్రకోపాల — వేణువనం- వజ్జియుడు (భిక్షువు)
సంరక్షించాలి మరి
శారీరక సంయమనం
సరిగా నెరవేర్చాలి
శారీరక దుశ్చర్యలు
జరగకుండ చూడాలి
శారీరక సత్కర్మలు
జరుగునట్లు చాడాలి. 11

వాచక ప్రకోపాన్ని
సంరక్షించాలి సదా
వాచక సంయమనం
పాటించాలి సరిగా
వాచకదుశ్చరితము
జరగకుండ చూడాలి
వాచక సచ్చరితము
జరుగునట్లు చూడాలి. 12

మానసిక కోపాన్ని
వదలి వేయాలి
మానసిక సంయమనం
పాటించితీరాలి
మానసిక దుశ్చర్య
మానాలి పూర్తిగా
మానసిక సచ్చరిత
మాత్రమాశించాలి. 13

ధీరులైన వారలు
దేహమదుపుజేతురు
వాక్కునదుపు జేతురు
మనసునదుపు జేతురు
అట్టి ధీరులెప్పటికి
ఉత్తమసంయమ శీలురు. 14



# 18. మల వర్గం

మలినాలను బౌద్ధంలో ఆస్రవాలంటారు. అవి కామ క్రోధ లోభ ద్వేషాదులవల్ల పుడతాయి. వాటిని ప్రక్షాళన చేసుకుంటూ ఉండాలి. అందుకే ఈ సందేశాలు.

క్షీణమైయున్నావు నీవు వాడి పోయిన ఆకులాగ
మృత్యుదూతలు నీదు ముంగిట కాచుకొని యున్నారునీకై
చితికిన ద్వారంబు చెంగట చతికిల బడ్డావు నీవు
చక్కగ పయనంబు జేయ, నీకడ సామాగ్రి లేదు. 1

జేతవనం- గోఘాతక పుత్రుడు

దీపాన్ని నిర్మించునీరక్షణ కొరకు
తెలివొందు శ్రమపడు నీ రక్షణ కొరకు
మచ్చలు తుడుచుకో నీరక్షణ కొరకు
వాంఛలు కడిగేయి నీ రక్షణ కొరకు
ఆర్యులకు వలె నీకు రక్షణ వుంటుంది
ఆర్యుల స్థానంబు నీకు దక్కుతుంది . 2

ఆయువంతా ఆవిరయ్యె
యమపురికరుదెంచు నీకు
ఆశ్రయించ చోటు లేదు
విడిదికి సామగ్రి లేదు. 3

జేతవనం- గోఘాతక-పుత్రుడు

కావాలొక రక్షణ దీపం
కావున నిర్మాణం జేసుకో
పెరగాలి ప్రజ్ఞా పటిమ
కృషి జేస్తూ పెంచుకో
దోషం లేక నీవుంటే
సంగం లేక నీ వుంటే

జన్మల రాకలు నీకేల
జరా బాధ లకు తావేల. 4

వెండికి బట్టిన మలినం కొలిమిలో — జేతవనం- ఒకానొక బ్రాహ్మణుడు
విడదీస్తాడు స్వర్ణ కారుడు
తనలో జేరే మలిన పుంజమును
తొలగించు కొనును బుద్ధిమంతుడు
క్రమ క్రమంగా
నీలోపలి మలినాలను నీవే
నిర్మూలించుకో. 5

ఇనుమున బట్టిన తుప్పు — జేతవనం- తిస్సుడు (వృద్ధ భిక్షువు)
ఇనుమునే తిని వేయును
దారి తప్పిన వానినట్లే
తనదు కర్మే చెరుచును. 6

పఠనం లేనిచో మంత్రం మలినం — జేతవనం- ఉదాయి (వృద్ధ భిక్షువు)
బాగుచేయనిచో ఇల్లేమలినం
సోమరియైనచో దేహం మలినం
జాగృతి లేనిచో భటునికి మలినం. 7

స్త్రీకి కళంకం చెడువర్తనము — రాజగృహ (వేణువనం)- ఒకానొక కులపుత్రుడు
దాతకు మత్సరమున్న కళంకం
ఇహపరాలకు చెడుగు* కళంకం (*పాపధర్మం)
అన్నిటి కంటె అవిద్య కళంకం
భిక్షువులారా మలం తొలగించి
నిర్మలంబుగా ముందుకు నడువుడి. 8,9

లజ్జలేకుండగను, — జేతవనం- సారి
కాకిమాదిరిగాను
శూరత్వమున్నట్లు,
విధ్వంసకునిగాను,
పరులను అవమాన
పరిచేటివానిగా,
డప్పాలు కొట్టుచు
చెవులు కొరికేరీతి,
మలినజీవనమున
బ్రతుకుటయు సులభం. 10

సిగ్గున వినమ్రుడిగ
నిత్యపరిశుద్ధుడుగ
అంటనితటస్థుడుగ
అప్రగల్భునిగాను
శుద్ధ జీవనమున
తెలివిగల దృష్టితో
బ్రతుకుటే కష్టం
(కాని సుఖమయమది). 11

ప్రాణి హింస జేయువాడు — జేతవనం- 500 ఉపాసకులు
అబద్ధాలు ఆడువాడు
ఒరులదాన్ని గ్రహించువాడు
పరుల సతులతొ పోవువాడు
సురా మేరయ త్రాగువాడు
త్రవ్వుకొను ఈ లోకముననే
తనదు మూలమ్మును తానే. 12,13

మానవుండా తెలిసికో ఇటు
పాపులను సంయమహీనుల,
దీర్ఘదుఃఖ కారకాలగు
లోభదృష్టి అధర్మములను
వదలుకో, తొలిగించుకో. 14

దానం చేస్తారు జనులు
తమ శ్రద్ధకు ఆనవాలు,
మత్సర పడతారల్పులు
పరుల తిండి, నీరు గూర్చి
పరితపింత్రు పగలురాత్రి
సమాధీ, శాంతియులేక. 15

జేతవనం -తిస్సుడు (బాలుడు)

కాన ఎవనికి అట్టి దోషం
సమూలంగ తొలగునో
అతడు పొందుసమాధిని
దివారాత్రములందును. 16

రాగం మించిన అగ్ని లేదు
ద్వేషం మించిన భూతం లేదు
మోహం మించిన జాలం లేదు
తృష్ణ మించిన ప్రవాహం లేదు. 17

జేతవనం - 5గురు ఉపాసకులు

పరుల దోషాలను ప్రకటింప సులభం
పొట్టులా వాటిని ప్రసరింప జేస్తాడు
తనదు దోషాలెంచ కష్టపడతాడు
కపట జూదరి లాగ కప్పి వేస్తాడు. 18

భద్దియనగరం(జాతియావనం)- మేణ్ణకుడు (శ్రేష్ఠి)

పరులదోషాలెంచి
పరిహాస మొందిన

జేతవనం ఉజ్ఞానసంగీ (వృద్ధ భిక్షువు)

పేరుకొనిపోవు మాలిన్యం
పరిశుద్ధిజెందదు చిత్తం. 19

కుశీనగరం- సుభద్దుడు
(పరివ్రాజకుడు)

ఆకాశాన మార్గ మగోచరం
అట్లే శ్రమణుడుఅగుపడడు
లోకంలో ప్రజ విషయాసక్తులు
తథాగతులు దూరం విషయాలకు. 20

ఆకాశాన మార్గ మగోచరం
బాహ్యంలో కనుపడడు శ్రమణుడు
కావు శాశ్వతం సంస్కారాలు
కారు భౌద్ధులు అస్థిరులు. 21



## *19.* ధర్మస్థ వర్గం

నిజమైన ధార్మికుడు ఎలా ఉండాలో, అతని లక్షణాలేమిటో చెప్పబడతాయి. చిత్తమాలిన్యాలను ప్రక్షాళనం చేయడం నిజమైనధార్మికత యని సందేశం.

జేతవనం- వినిచ్చయ
మహా మచ్చుడు

తొందరపడి వ్యవహారం చేసి
ధర్మపరుడు కాలే డెవడు
అర్థ మనర్థం యోచన చేసి
అడుగులు వేసేవాడు విజ్ఞుడు. 1

సమముగ నయముగ ధర్మంవైపు
జనులను నడిపేవాడు ధర్మజ్ఞుడు
మేధావి ధర్మస్థు డాతడే
ధర్మసంరక్షకుడును అతడే. 2

దండిగ మెండుగ మాట్లాడినచో
పండితుడెవ్వడు కాలేడు
స్థిరత్వము స్నేహం కలవాడు
భయరహితుండే పండితుడు. 3

జేతవనం వజ్జియుడు (భిక్షువు)

ఎక్కువెక్కువ మాట్లాడినంత
ఎవ్వడునూ ధర్మజ్ఞుడుకాడు
కొద్దిగ విన్నా, గొప్పగ చేసిన
ధార్మికుడాతడు, ధర్మజాగృతుడు. 4

జేతవనం- ఏకుద్దానుడు (వృద్ధభిక్షువు)

తల వెంట్రుకలు నెరిసినంతనే
స్థవిరుడాతడు కాలేడు
వయసుమాత్రము పెరిగింది
వచ్చింది వృద్ధత్వం వృథాగా. 5

జేతవనం- లకుంటక భద్దియుడు(వృద్ధభిక్షువు)

సత్యం, ధర్మం, అహింస, దమము
సంయమ, సద్గుణములవాడు
దోషరహితుడు, ధీరుడు అయితే
స్థవిరుడు కాగల డాతడు. 6

గొప్ప వక్త కానివ్వండి
అందగాడు కానివ్వండి
ఈర్ష్య, మత్సరం, శఠత్వ*ముంటే (* మోసం, కుల్సితం)
సాధు వెన్నటికి కాలేడు
ఈర్ష్యను దునిమి
దోషం విడిచి
ఉండగలవాడు మేధావి
అతడే సాధువు కాగలడు. 7,8

జేతవనం- ఎందరో భిక్షువులు

అబద్ధాల కోరూ, వ్రత జేతవనం- హత్థికుడు
నిష్ఠ లేనివాడూ - మరి (భిక్షువు)
ముండనమున్నా
శ్రమణుడుకాడు;
ఇచ్ఛా లాభాలన్నీ వుంటే
ఎలా శ్రమణు డవుతాడు? 9

పెద్దవి గానీ చిన్నవిగాని
పాపాలన్నీ పక్కకు తొలిగితే
పాపరహితుడవుతాడు
ఆతడు - శ్రమణుడున బడతాడు. 10

భిక్షుమెత్తు కున్నంత మాత్రాన జేతవనం- ఒకానొక
భిక్షువు కాలేడెవ్వడు బ్రాహ్మణుడు
ఇతరుల్ని అడుక్కోవడం గాక
నైతికా చరణతో ఉంటే
భిక్షువవుతాడు వాడు
విషమధర్మమున కాడు. 11

పుణ్యాపాపాల నతిక్రమించి
బ్రహ్మచర్య మవలంబించి
ఇహంలోన అవగాహన గాంచి
జ్ఞానంతో విహరించినప్పుడే
ఆతడు భిక్షువు కాగలడు
(అతడే శ్రమణుడు అనబడును). 12

మౌనంగా ఉన్నంతమాత్రాన జేతవనం- తీర్థికుడు
మునికాలేడు ఎవ్వడు
విద్యాహీనుడైన మూఢుడు

మునికాలేడు ఎన్నటికి
పండితుడై తులనాత్మక దృష్టితో
పాపం పూర్తిగ వర్జించి
ధర్మం బాగా గ్రహియించి
బాహ్యాభ్యంతర లోకాల జూచి
బాగా అవగాహన ఉంచి
మసలు కొన్న వాడే మహాముని. 13, 14

జేతవనం- అరియ బాడిసకుడు

జీవుల హింసించువాడు
ఆర్యుడు కాలేడు
సకల జీవులపట్ల
అహింసగ మసలు వాడు
ఆర్యుడు, అసలార్యుడు. 15

జేతనం- శీల సంపన్నులగు పలువురు భిక్షువులు

కేవలం శీలంతో కాదు
కేవలం వ్రతాలతొ కాదు
కేవలం శాస్త్రాలతొ కాదు
కేవలం సమాధితొ కాదు
కేవలం ఏకాంతంతో కాదు
'ప్రపంచ జనులకు సాధ్యం కాని
నైష్కర్మ్య సుఖం పొందుదును'
అని భావిస్తూ
భిక్షువులారా!
విశ్రమించకండీ - మీరు
ఆస్రవాలు నశించే దాక
విశ్రమించవద్దు - మీరు
విశ్రమించవద్దు. 16,17



# 20. మార్గవర్గం (మార్గం)

అష్టాంగ మార్గానికి సంబంధించిన ప్రబోధాలు ఉన్నాయి. అది ఉత్తమమార్గమని సూచిస్తాయి ఈ గాథలు. సమ్యక్‌దృష్టి, సమ్యక్‌సంకల్పం, సమ్యక్ వాక్కు, సమ్యక్‌కర్మ, సమ్యక్‌జీవనం, సమ్యక్ కృషి, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి అనే ఎనిమిదింటిని అష్టాంగమార్గం అంటారు.

మార్గాల్లో అష్టాంగమార్గం శ్రేష్ఠం — జేతవనం-
సత్యాల్లో చతురార్య సత్యాలు శ్రేష్ఠం — 500 భిక్షువులు
ధర్మాల్లో వైరాగ్య ధర్మం శ్రేష్ఠం
ద్విపాదుల్లో విపశ్యుడు* శ్రేష్ఠుడు. (బుద్ధుడు) 1

విశుద్ధ ధర్మానికిదే మార్గం
దీన్నిమించి మరొక్కటి లేదు
ఈ మార్గం అనుసరించండి
దీనికి మారుడు మూర్ఛపోతాడు 2

అనుసరించండి-ఈ మార్గం
అంత మవుతుంది మీ దుఃఖం
రాగవిచ్ఛేద బాణ మిది
స్వయంగ నేనే గ్రహించితి
ప్రియంగ మీకు చెప్తున్నా. 3

కార్య సిద్ధికై కృషిచేయాలి
బోధసల్పుట బుద్ధులధర్మం
కృషి చేయుట మీ కర్తవ్యం
ధ్యానమగ్నులై మార్గముబట్టి
ఆచరించితే నిరంతరం
తొలగును మారుని బంధాలు. 4

అనిత్యాలు సంస్కారాలని
జ్ఞానచక్షువుతొ వీక్షిస్తే
అంతటితో అంతందుఃఖం
ఉత్తమ విశుద్ధ మార్గమిదే. 5

సర్వసంస్కారాలు దుఃఖలాని
స్వయం ప్రజ్ఞతో కనుగొంటే
ఉడుగును దుఃఖం దానికది
ఉత్తమ విశుద్ధ మార్గమిది. 6

సర్వం అనాత్మమయంబని
స్వయం ప్రజ్ఞతో వీక్షిస్తే
సమసి పోవును దుఃఖం
సవిశుద్ధతకు మార్గమిది 7

జేతవనం- (యోగి)తిస్సుడు
(వృద్ధ భిక్షువు)

జడుడుగా ఉండేటివాడు
చేయవలసిన సమయమున పని
చేయకుండగ ఉండెనేని,
యౌవనం బలముండి కూడా
మందకొడిగా ఉండెనేని,
మదిని రేగిన సెగలు తాను-శ
మింప జేయక ఉండెనేని
ప్రజ్ఞపొందగ దారిలేదు
నిబ్బణం మాటసలు లేదు. 8

రాజగృహ (వేణువనం)

మాటల యందు జాగృతి గల్గి
మనసు నిండుగా నిగ్రహముండి,
కాయమందు చెడుకర్మము లేక
త్రయి మార్గాన పవిత్రత గల్గి

ఋషుల మార్గమున నడవాలి
(దొసగులు దూరం చేయాలి.) 9

జ్ఞానముదయించు ధ్యానం నుంచి
జ్ఞానం క్షయించు ధ్యానం లేక
ఉదయ క్షయముల రెంటిని ఎరిగి
జ్ఞానోదయాని కనువుగనడుచుకో. 10

జేతవనం- పోఠిలుడు
(వృద్ధ భిక్షువు)

భయ సందోహం తృష్ణావనము
ఛేదించుము ప్రతివృక్షాన్ని
ఛేదించుము వనమంతటినీ
భిక్షువులారా, విపినం పోతే
నిర్వాణం మీ కరతలమౌ. 11

జేతవనం- ఒకానొకవృద్ధ
భిక్షువు

విషయారణ్యము నందు
కామతృష్ణ కొంచెమేని
నారిపైన నరునికున్న,
నిరసించక మిన్నకుంటే,
పాలు త్రాగులేగ దూడ
తల్లిని విడనాడనట్లు
బంధంలోముంచును. 12

శరత్కాలమున
పెరిగే కలువను
కరముతోలాగి
పెరికివేయునటు,
తృంచి వేయు
మాత్మాభిమానము,
సుగతుడు చూపిన

జేతవనం- సువర్ణ కారుడు
(వృద్ధ భిక్షువు)

శాంతిమార్గమగు
నిర్వాణమును
అనుసరించుము. 13

జేతవనం-
మహాధనికుడగు
వణిజుడు

'వర్షాకాలపు ఉనికి ఇక్కడ
వసంత కాలపు ఉనికి అక్కడ
వేసవి కాలపు ఉనికి ఫలాన'
వింతగ మూఢుడు చింతిస్తాడు
అంతరాయముల (మృతిని) చూడడు. 14

జేతవనం-కిసాగోతమి
(వృద్ధిభిక్షుణి)

వరద వెల్లువ ముంచేస్తుంది
నిద్రిస్తున్న గ్రామం మొత్తం
పుత్రపశ్వాదులం దాసక్తుని
మృత్యువు హరించి వేస్తుంది. 15

జేతవనం-పటాచారా
(వృద్ధభిక్షుణి)

మృత్యువాత బడినప్పుడు
పుత్రులు రక్షించలేరు
మృత్యువాతబడిన వాణ్ణి
పితరులు బ్రతికించ లేరు
మృత్యువాత బడిన వాణ్ణి
జ్ఞానులు కాపాడ లేరు
విజ్ఞుడిది తెలిసి, శీల-
పరివేష్టితుడై ఉండి,
నిర్వాణమును జూపు
దారిని సరిజేసుకొను. 16,17



# 21. ప్రకీర్ణక వర్గం (కదంబం)

వివిధరకాలైన విషయాలతో కూడినది ప్రకీర్ణం. ధర్మాన్ని, సంఘాన్ని ఆశ్రయించమని చెప్పినబోధనలు. సదాగౌతమ శిష్యులిలా వుండాలని చెప్పాడు.

కొద్ది సుఖము విడిచినంతనే
గొప్ప సుఖమే కల్గుచో
కొద్ది సుఖము విడుచు ధీరుడు
గొప్ప సుఖము నిమిత్తము. 1

రాజగృహ (వేణువనం)- గంగావరోహణుడు

పరులను బాధించి తాను
పడయ నెంచి సౌఖ్యమున్
వైర ప్రవృత్తికి లోబడి
విడువడెప్పుడు వైరమున్.* (* ద్వేషరూపం) 2

జేతవనం- ఒకనొక పురుష్కుడు

చేయ వలసిన పనిని వదలి
చేయరానిది చేయుచో
చిత్త దోషం పెంచుకొందురు
మత్తులై కల్మష చిత్తులై. 3

భద్దియనగరం (జాతియావనం)- భద్దియుడు(భిక్షువు)

తెలిసి నిత్యం దేహ స్మృతిని
తప్పుపనులు చేయనొల్లరు
వలసినదియే చేయుచుందురు
మలినములువై తొలగి పోవును. 4

తల్లిలాకనిపించు తృష్ణను
తండ్రిలాకనిపించుఅహమును
క్షత్రియ రాజద్వయమ్మను
ప్రకృతి-జడవాదములను
రాష్ట్రమను * రాగాది బృందం (* బంధం)

జేతవనం- లకుంటక భద్దియుడు (వృద్ధ భిక్షువు.)

మొత్త మన్నిటి హతం జేసిన
*బ్రాహ్మణునకు పాపమంటదు. (* అర్హతుడు) 5

(ప్రకృతి నిత్యం ఉంటుంది అనే వాదం, Eternalism జడ ప్రకృతి వాదం, Nihilism రూప విజ్ఞానాది ఉపాదాన పదార్థాలు Sense-avenues, sense objects).

తల్లిని తండ్రిని ఇరువుర
బ్రాహ్మణ రాజద్వయమ్మును (ప్రకృతి, జడవాదాలు)
* పంచజ్ఞానావరణవ్యాఘ్రము
మొత్తమన్నిటి హతం జేసిన
బ్రాహ్మణునకు పాపమంటదు. 6

(* అయిదవది (శంక) అని మూలంలో ఉంది. కాని అయిదు జ్ఞానావరణాలు అని అర్థం చేసుకోవాలి.)

రాజగృహం (వేణువనం)-
దారుసాకటిక పుత్తుడు.

సదా గౌతమ శిష్యు లెల్లరు
విధాయకమౌ బౌద్ధ ధ్యానం
సదా రాత్రిందివము లందు
సల్పు మిక్కిలి జాగరూకులు. 7

సదా గౌతమ శిష్యు లెల్లరు
విధాయక మౌ ధర్మ ధ్యానం
సదారాత్రిందివములందు
సల్పు మిక్కిలి జాగరూకులు. 8

సదా గౌతమ శిష్యు లెల్లరు
విధాయక మౌ సంఘ ధ్యానం
సదారాత్రిందివములందు
సల్పు మిక్కిలి జాగరూకులు. 9

సదా గౌతమ శిష్యులెల్లరు
విధాయక మౌ "దేహధ్యానం"
సదారాత్రిందివములందు
సల్పు మిక్కిలి జాగరూకులు. 10

సదా గౌతమ శిష్యులెల్లరు
విధానముగ నహింసచింతన
సదా రాత్రిం దివములందు
సల్పు మిక్కిలి జాగరూకలు 11

సదాగౌతమ శిష్య లెల్లరు
విధాయక సద్భావమననం
సదారాత్రిందివములందు
సల్పు మిక్కిలి జాగరూకులు. 12

వైశాలి (మహావనం)-
బజ్జిపుత్తకుడు (భిక్షువు)

సన్యసింప కష్టతరము
సంసారం దుఃఖకరము
సరిగ లేని గృహం అరిష్టం
సములుకానిచో చెలిమికష్టం
అమిత దుఃఖమధర్మ మార్గం
అనుసరించుము ధర్మ మార్గం
ఆశ్రయించకు క్లేశ కార్యం. 13

జేతవనం- చిత్తుడు
(ఒక గృహస్థుడు)

శ్రద్ధ-శీలం-యశోశోభ
వృద్ధిగాగల వాడు నెట నెట
సంచరించిన అచ్చటచ్చట
సత్కరింప బడును మిగుల. 14

జతవనం- సుభద్ర

మంచివారు దూరాననున్నా
ప్రకాశింతురు హిమాలయముగ

చెడ్డవారు దగ్గరలోనున్నా
ఆనరు నిశిబాణమట్లు. 15

ఆసనము ఏకాంతముగ శయ జేతవనం - ఏకాకియగు
వాసము ఏకాంతముగను వృద్ధభిక్షువు
ఆత్మసంయమమప్రమత్తత* *(అతన్ద్రిత)
అమర సుఖమునిచ్చువనమున. 16

## 22. నిరయ వర్గం (నరకంతీరు)

నిరయ అంటే సుఖం లేనిది, అదే పతనమార్గం లేక నరకం. వేరేలోకం అని కాకుండా ఈలోకంలోనే పతనం వల్ల సంభవించే దుఃఖాలు చెప్పబడ్డాయి.

అబద్ధీకుడు పోవు నరకం జేతవనం-సుందరి (భిక్షుణి)
చేసి లేదను వాడు కూడ
ఇద్దరూ దేహాంతరమున
నీచ కార్యములందు సములు. 1

కాషాయము దాల్చి రాజగృహం (వేణువనం
పాప కార్యం జేయు - పాపానుభవవ్యక్తి
దుష్కర్మలొందుదురు
దురిత నరకంబును. 2

చెడ్డ వాడవినీతి పరుడు వైశాలి- వగ్గుముదా
ప్రజల తిండి తినుట కన్న తీరవాసియైన భిక్షువు.
కణ కణ నిప్పులా మండే
లోహ ముద్ద తినుట తగును. 3

ప్రమత్తుడుగా ఉండు వాడు జేతవనం- ఖేముడు
పరులభార్యల పట్టు వాడు (శ్రేష్ఠిపుత్రుడు)
పొందును దుర్గతులు నాల్గు;

నిద్రలేమి, పుణ్యాలేమి,
నింద లేదేని నరకము,
పుణ్యక్షీణత, దుర్గతి,
మహాభీతి, రాజదండన
కాన పరసతిపొందువలదు. 4,5

జేతవనం- కటుభాషి (భిక్షువు)

పట్టుదప్పి దర్భలను పట్టితే
గట్టిగ చేతిని చీల్చి వేయును
సరిగనడవని యతుల బ్రతుకులు
వారినే జేర్చు నరకదారులకు. 6

చెడిన కార్యం చెడిన వ్రతము
సరిగ లేని బ్రహ్మచర్యం
ఒరగ జేయవు గొప్ప ఫలము. 7

చేయ దలచిన చేయిసరిగ
శక్తి మేరకు ఆచరించు
సరిగ జేయని సన్యసంబు
చెరుపునే అధికముగ దెచ్చు. 8

జేతవనం- ఈర్ష్యాళువు నగు ఒక స్త్రీ

శ్రేష్టము, చెడు చేయకుండుట
చెడ్డచేష్ట పరితాప మిచ్చును
మంచి పని చేయడం మేలు
ఎంచ పశ్చాత్తాప మొసగదు. 9

జేతవనం- పలువురు భిక్షువులు

చక్కగా సరిహద్దు నగరం (కోట)
రక్షితం లోపల బయట
తన్ను తాను మనిషి నిత్యం
తిన్నగా కాపాడు కొనవలె,

ఒక్కక్షణము అజాగ్రత్తైన
దుఃఖమొదవును నరకమేగతి. 10

సిగ్గు పడుచుంట సిగ్గుకు తగని చోట
సిగ్గుపడ కుంట సిగ్గుకు తగిన చోట.
అట్టి మిథ్యాచార దృష్టి వల్ల
కొట్టు మిట్టాడుదురు దుర్గతిని బట్టి. 11

జేతవనం- జైనసాధువు

భీతి లేని చోట భీతిపడుచు
భీతి ఉన్న చోట భీతిపడక
అట్టి మిథ్యాచార దృష్టితోడ
కొట్టుమిట్టాడుదురు దుర్గతినిబట్టి. 12

చెడ్డదానిని మంచిగ ఎంచుట
మంచి దానిని చెడ్డగ తలచుట
మిథ్యా చారపు దృష్టి ఇది
మనుజుల దుర్గతి పాల్జేయు. 13

జేతవనం- తీర్థికుని శిష్యుడు

విడువవలసినది విడువవలసినదిగ
విడువరానిది విడువరానిదిగ
సమ్యక్ దృష్టి కల్గిన జీవులు
సుగతిని బట్టి పోవుదురు.
(దోషమును దోషముగ జూచుట
దోషము లేమిని దోషరహితముగ
చెడ్డను చెడ్డగనే గమనించుట
మంచిని మంచిగ మది భావించుట
సత్క్రమ దృష్టిది సద్గతినిచ్చు). 14



# 23. నాగవర్గం

ధర్మధీరతకు ఏనుగును ప్రతీకగాతీసుకున్నారు. మంచి శిక్షణ పొందిన మనసు మంచి శిక్షణపొందిన గజము లాంటిది. మంచి జ్ఞానితోను మంచి మిత్రునితోను స్నేహం చెయ్యమన్నారు (9,10)

ధనుర్బాణాల దాడిని దంతి — జేతవనం- ఆనందుడు
సహిస్తుంది సంగ్రామంలో
దుర్గుణ శరాల వాడిని నేను
భరిస్తాను దుర్జన లోకంలో. 1

శిక్షణ పొందిన గజమును మాత్రం
సంగ్రామంలో వదులుదురు;
శ్రేష్టమైన కుంజరమునురాజు
ఠీవిగ అధిరోహిస్తాడు
కటువాక్యాలు, తిరస్కారములు
దమన శీలుడు సహిస్తాడు
అతడే శ్రేష్టుడు మనుజుల్లో
(అతడే ఘనుడు ధర్మ దృష్టిలో) 2

శిక్షణగల గార్ధభాలు శ్రేష్ఠం
శిక్షణగల తురగాలు శ్రేష్ఠం
శిక్షణ గల కుంజరాలు శ్రేష్ఠం
స్వయం శిక్షితుడిం కాశ్రేష్ఠం. 3

గార్ధభాలు గుర్రపు బండ్లు — జేతవనం- మహాపతి భిక్షువు
నిర్వాణానికి చేర్చలేవు
స్వయం శిక్షణ సంయమనాలు
చేరుస్తాయి నిబ్బణానికి. 4

'ధన పాలక' మహాగజం
సైన్యాన్ని ఛెండాడును,
అదుపు జేయ వశం కాదు
బంధిస్తే తినదు తిండి
చింతిస్తూ వన గజముల. 5

జేతవనం- పరిజిణ్ణ బ్రాహ్మణపుత్రుడు

సోమరిగా సంచరించు వాడు
తిండి పోతుగా తిరిగే వాడు
మొద్దు నిద్రలో మున్గేవాడు
పక్కపైన బడి దొర్లే వాడు
పంది లాగ ఊరుండేవాడు
పుట్టు-చక్రాన పడిపోతాడు. 6

జేతవనం- పసెనది (కోసల రాజు)

ఇష్టమొచ్చిన రీతి మునుపు
నచ్చినట్టి చోటులందు
వచ్చిపోవుసుఖం కొరకు
మెచ్చినట్లు తిరిగె చిత్తం
మత్త గజమును మావటీడు
చిత్తు చేసిన విధంగానే
చిత్తమును సంపూర్తిగా-నా
హస్తగతము చేసి కొందు. 7

జేతవనం- సామణేరుడు

జాగృతిలో ఆనందించు, స్వ-
చిత్తంలో రక్షణచెందు
ఊబిలో ఏనుగు పడ్డట్టు
క్షోభలో చిత్తం పడిపోతే
ఉద్ధరించుకో నీకు నువ్వు. 8

జేతవనం- కోసలరాజుని పావేయ్యక మను ఏనుగు

బుద్ధి పరిపక్వత
సద్గుణం, ధీరత
సహచర్య శీలత
మిత్రునికి ఉన్నచో
మనసుంచి శ్రమకోర్చి
సంచరించతనితో. 9

పారివేయ్యకము-
పలువురు భిక్షువులు

బుద్ధి పరిపక్వత
సద్గుణం ధీరతి
సహచర్య. శీలత
మిత్రునికి లేనిచో
జీవించు ఒంటరిగ
గజములా వనములో
రాజ్య భ్రష్టునిలాగ. 10

ఏకాంత జీవనం మేలు
మూర్ఖునితో స్నేహం చేటు
పాపాలు చేయకుండగ
ఏకాంతముగ నుండు
ఏ బంధంలో పడకుండ
అడవి ఏనుగట్లు తిరుగు. 11

అక్కరలో మిత్రులు వుంట
సుఖదాయకము
ఒక్క దానిలో నైనా తృప్తి
సుఖదాయకము
జీవితాన తుది మేలు కల్గుట
సుఖదాయకము

హిమవత్ప్రదేశం-
మారుడు

దుఃఖం సర్వం ధ్వంసంకావడం
సుఖదాయకము. 12

లోకంలో తల్లి సేవ సౌఖ్యం
లోకంలో తండ్రి సేవ సౌఖ్యం
సాధు సేవనం ఎంతో సౌఖ్యం
బుద్ధుల సేవ అతి సౌఖ్యం. 13

జరవరకు సౌశీల్యం సౌఖ్యం
స్థిరత, శ్రద్ధ కలిగిన సౌఖ్యం
ప్రజ్ఞాలాభం ఎంతో సౌఖ్యం
పాప రహిత మత్యంత సౌఖ్యం. 14



## *24. తృష్ణావర్గం.*

తృష్ణ అనగా ఇచ్ఛ, ప్రగాఢ వాంఛ, పేరాస. అది దప్పికలాంటిది, అయితే తీరనిది.

దుఃఖానికి తృష్ణయే మూలకారణమని బౌద్ధంచెపుతుంది. కామతృష్ణ, భవతృష్ణ (లోకబంధం, అస్తిత్వ కాంక్ష), విభవతృష్ణ (లోకమందువిముఖత, అస్తిత్వ రాహిత్య కాంక్ష) ప్రధానమైన 3రకాలు. మరోఆరురకాలు ఇంద్రియ సంబంధమైనవి. శబ్దతృష్ణ, స్పర్శతృష్ణ రూపతృష్ణ, రసతృష్ణ గంధతృష్ణ అనుభూతితృష్ణ మొత్తం 36తృష్ణా ప్రవాహాలున్నాయన్నాడు (6లో).

మందమతికి తృష్ణ 'మాలువా' తీగలా పాకి పోతుంది
పళ్ళకై వనమంత కోతిలా ఆతడు తిరుగుతుంటాడు. 1

ఈ లోకంలో విషరూప తృష్ణ
ఎవ్వని దాసుని చేస్తుందో
వాడి దుఃఖాలు "వీరణ" గడ్డిలా
వృద్ధి చెందుతూ ఉంటాయి. 2

జేతవనం-
కపిలమచ్ఛుడు

ఈ లోకంలో తొలగని తృష్ణను
ఎవ్వడు జయించగలవాడో
కమలం పై నీటి బిందువులా
కదలి పోవు నాతని దుఃఖం. 3

అందరికీ శుభం-మీ
అందరికీ శుభం
వట్టి వేళ్ల కొరకు దాని
మొదలును పెకలించునట్లు
తృష్ణను పెరికేయండి
శేషమేమి లేకుండా,
మారుడు మిమ్ముల మరి
వరదలా తడపకుండా. 4

జేతవనం- గూఢుడు
సూకరపోతికుడు
అనువారు

వేళ్ళతో పాటు నరక్క పోతే
వృక్షం మరల చిగురిస్తుంది
తృష్ణా శేషం నిద్రిస్తున్నా
పూర్తిగా అది నశించకున్నా
పొంగివస్తుంది దుఃఖం మరల. 5

తృష్ణకున్నాయి ముప్పది ఆరు
ప్రవాహాలు పటు తరముగను
తృష్ణా బద్ధుని చేయును ప్రతిదీ
ప్రాపంచిక సుఖలాలస పెంచి
ప్రవాహాలు ఆలోచన పెంచి
బలో పేతముగ పని చేస్తాయి
కామ వంతమై ఉంటాయి
బలవంతంగా చుట్టేస్తాయి. 6

(*జ్ఞానేంద్రియాలకు, వాటివిషయాలకు, కామతృష్ణ, భావతృష్ణ, విభావతృష్ణ బాహ్యాభ్యంతరభేదాలతో ముప్పది ఆరు.)

తృష్ణకు సంబంధించిన వరదలు
ఎడాపెడా ప్రవహిస్తాయి
తృష్ణా లతలు పుట్టి పెరిగి బహు
స్థిర పడతాయి ఎంతో ఏపుగ
గమనించాలి సూటిగ వాటిని
ఛేదించాలి ప్రజ్ఞతో మూలం. 7

జీవుల ఆనందాలు
చిత్తానికి బలే మత్తు,
తృష్ణానదిలో తడిసి
హత్తుకు పోతాయి మరి,
జనమో సుఖ లాలసబడి
జరా జన్మ పాలవుదురు. 8

తృష్ణకు లోబడిన జనం
కట్టేసిన కుందేళ్లు
బెదురు బెదురు చూపులతో
భీతి చెందు తుంటారు.
చిత్త బంధనాల జిక్కి
తిరిగి తిరిగి బహుకాలం
దుఃఖితులౌతుంటారు. 9

(*కామం - ద్వేషం - భ్రాంతి -గర్వం లాంటి తప్పుడు విలువలు)

తృష్ణకు లోబడిన జనం
కట్టేసిన కుందేళ్లు
బెదురు బెదురు చూపులతో

భీతి చెందుతుంటారు
భిక్షువులు విరక్తి చెంది
తృష్ణను తుంచేయాలి. 10

నిబ్బణ మందాసక్తుడు
తృష్ణను తరిమేయాలి
వనాలకు పరుగిడినా
స్వేచ్ఛ అలా పొందినా
ఇంటి వైపు తిరిగి చూస్తే
పడతాడు బంధంలో
పరుగిడుతాడటు నిటూ. 11

వేణువనం- విభక్తకుడు
(భిక్షువు)

తాడుతో కట్టినా
కొయ్యతోకొట్టినా
ఇనుముతో మెట్టినా
గట్టిబంధంకాదు
విబుధువిటు పలికారు;
రత్నాల యందు ఆ
భరణాలయందును
సతులందు సుతులందు
మది తగుల్కొనెనేని
అది మహాబంధనం. 12

జేతవనం-
బన్ధనాగారుడు

మిగుల బలమైనది ఆ బంధమన్నారు,
మనిషిని తినేస్తుంది నాశనం చేస్తుంది
విసిరేసి కొడ్తుంది, విడవశక్యంకాదు,
దీన్నిసైతం బుధులు తెంచి వేస్తారు.
ఇంద్రియా నందాలు తుంచి వేస్తారు
ఎట్టి కోరిక లేక సన్యసిస్తారు. 13

తానల్లు కున్నట్టి తనగూటిలోనే
తానుబందీ యౌను తగ పట్టుపురుగు
పడతారు తమదైన తృష్ణా ప్రవాహంలో
ఇడుముల దుఃఖాల పాలయి రక్తులు
ధీరులైతే దాన్ని ఛేదించుతారు
దుఃఖాని దునుమాడి జీవించుతారు
అనపేక్ష దృష్టితో సంచరిస్తారు. 14

రాజగృహం (వేణువనం)- ఖేమ (బింబిసారుని పట్ట మహిషి)

వెనుక- ముందు-మధ్య అనిచూడవద్దు
భవసాగరపు తీరమును చేరవయ్యా
మనసు బంధాలు సకలమ్ము వీడనిమ్ము
జన్మ-జర-మరణముల రానీయ వద్దు. 15

రాజగృహం (వేణువనం)- ఉగ్గసేనుడు (శ్రేష్ఠి)

తర్కవితర్కంలోన తగుల్కొని
తీవ్రరాగముల తలమున్కలుగా
ఇంద్రియ సుఖమున ఇరుక్కు పోయిన
వాని బంధాలు దృఢ తరంబుగు
తృష్ణ దిన దిన వృద్ధి చెందును. 16

జేతవనం - ధనుగ్గహ పండితుడు

అనుమానాలకు స్వస్తి పలుకుచు
ఆలోచన లరికట్టగల్గిన
ఆసక్తి పరుడు జాగృతి పరుడు
దైహిక అశుభం జూచేవాడు
తృష్ణను తెంచి వేస్తాడు
మారుని మద మడగిస్తాడు. 17

జీవిత గమ్యం చేరిన వానికి
భయమును పారద్రోలిన వానికి
తృష్ణారాగము తొలగినవానికి

జేతవనం-మారుడు

బ్రతుకు ముళ్ళు పెరికేసిన వానికి
ఈ దేహం చిట్ట చివరి దౌను. 18

అంటదాతని కెలాంటి తృష్ణయు
అపరిగ్రహము ఆతని వ్రతము
ఆతడెరుగును శబ్దశాస్త్రము
అక్షర కూర్పుల పర్యవసానం
అతడే విజ్ఞుడు, అతడే ప్రాజ్ఞుడు. 19

వారణాసి నుండి గయకు పోవు త్రోవలో- ఉపకుడు (ఆజీవకుడు)

అన్నిటినీ నే జయించితి
అన్నిటినీ నేనెరింగితి
అన్నిటినీ నేత్యజించితి
అన్నిటను నేనలిప్తుడ
తృష్ణ తొలగగా విముక్తుడ
స్వయముగ పొందితి సంబోధి
ఎవరిని నేనిక గురు వందున్? 20

జేతవనం సక్కదేవరాజు

ధర్మదానం జయిస్తుంది సర్వ దానా లన్నిటిన్
ధర్మరసమే జయిస్తుంది సర్వరసముల నన్నిటిన్
ధర్మరతియే జయిస్తుంది సర్వరతులను దీటుగా
తృష్ణ లేమి జయిస్తుంది సర్వ దుఃఖపు ధాటినీ 21

జేతవనం- అపుత్రకుడగు శ్రేష్ఠి

తీరాన్ని దాటేటి తహతహలేకుంటే
దుర్మతిని భోగాలు తుదముట్టుతాయి
దుర్బుద్ధికి భోగతృష్ణ విరోధిగా
దుంపనాశం జేయు పోషించినవాణ్ణి. 22

పాండుకమ్బల శిల (దేవలోకం)-అ ఙ్కురుడు)

గడ్డి-గాదం నేలకు మలినం
కామం మానవజాతికి మలినం;

కామ రహితునికి దానం చేస్తే
గొప్పఫలం ప్రాప్తిస్తుంది. 23

గడ్డిగాదం నేలకు మలినం
ద్వేషం మానవజాతికి మలినం
ద్వేషరహితునికి దానం చేస్తే
దొడ్డఫలం ప్రాప్తిస్తుంది. 24

గడ్డిగాదం నేలకు మలినం
మోహం మానవ జాతికి మలినం
మోహరహితునికి దానం చేస్తే
గొప్పఫలం ప్రాప్తిస్తుంది. 25

గడ్డిగాదం నేలకు మలినం
వాంఛ మానవ జాతికి మలినం
వాంఛ రహితునికి దానం చేస్తే
గొప్ప ఫలం ప్రాప్తిస్తుంది. 26



**ఆలోచన**
**సరిపోదు,**
**ఆచరణే**
**ధమ్మపదం.**

# 25. భిక్షువర్గం

భిక్షువుకు ఉండవలసిన లక్షణాలు చెవుతాడు. భిక్షువు మౌనంగా గృహస్థుల ఇళ్లముందు నిలబడాలి. ఇస్తేనే తీసుకోవాలి. అలాజీవించడం బుద్ధుల సంప్రదాయధర్మమన్నాడు.

కంటి అదుపు మంచిది — జేతవనం- 500 భిక్షులు
కర్ణం అదుపుమంచిది
నాసిక అదుపు మంచిది
నాలుక అదుపు మంచిది. 1

ఒడలు అదుపు మంచిది
వాక్కు అదుపు మంచిది
మనసు అదుపు మంచిది
అదుపన్నిట మంచిది
అన్నిటిలో అదుపుండిన
భిక్షుకు దుఃఖం తొలగు 2

మాటల్లో కాళ్లే తుల్లో — జేతవనం- హంసఘాతకుడు (భిక్షువు)
ఉత్తమాంగములో అదుపుండి
ధ్యాననిరతిని సమాధి చిత్తుడై
సానందంగా ఏకాంతంగా
ఉన్నవానిని భిక్షువందురు. 3

నాలుకపై నిగ్రహం — జేతవనం- కోకాలియుడు
పలుకుల్లో పరిమితం
గర్వంలో శూన్యత
ధర్మంలో వివరణ
కలవాడే భిక్షువు
వాని మాటసుందరం. 4

ధర్మంలో జీవిస్తూ
ధర్మంలో రమి యిస్తూ
ధర్మాన్ని ధ్యానిస్తూ
ధర్మాన్ని స్మరియిస్తూ
ఉండే వాడే భిక్షువు;
పడిపోడు ఎప్పుడూ
సద్ధర్మంనుండతడు.

జేతవనం- దమ్మారాముడు (వృద్ధభిక్షువు)

5

కొద్దిగా లభించినా
వద్దని నిరసించరాదు
తనకులభించిందాన్ని
తక్కువగ చేయరాదు
ఇతరుల ఉన్నతిజూచి
ఈర్ష్య పడే భిక్షువు
ఏకాగ్రత చెంద లేడు
(ఏమీ సాధించలేడు).

రాజగృహం (వేణువనం)- విపక్షసేనుడు(భిక్షువు)

6

కొద్దిగా లభించినా
వద్దని నిరసించరాదు
శుద్ధ జీవనం కలిగి
నిత్య జాగృతి* జెంది
విహరించు భిక్షువును
దేవతలుస్తుతింతురు.

* (అతన్ద్రితం)

7

నామ రూపములలోన
మమకారం లేని వాడు
ఏమీప్రాప్తించకున్నా
బాధపడని వాడుభిక్షు.

జేతవనం- 5 గురు అగ్రదాయక భిక్షువులు

8

జేతవనం- పలువురు భిక్షువులు

మైత్రితో మెలగుచూ
బౌద్ధ శాసన మందు
శ్రద్ధగల భిక్షువు
సంస్కారములు దాటి
సుఖ శాంతు లిచ్చేటి
స్థానమొందుట తథ్యం. 9

ఖాళీగా నుంచుము/భిక్షూ-ఈనావను!
ఖాళీగా నున్నచో/కడువేగమె చేరును
రాగద్వేషాలుపోగ
ప్రాప్తించు నిర్వాణం 10

ఐదింటిని ఛేదించు
(ఆత్మభ్రమ, శంక, తప్పువ్రతానుష్ఠానం,
భోగాసక్తి, ద్వేషం)
ఐదింటిని వదిలేయి
(రూపంపట్ల తృష్ణ, రూపరహితంపట్ల (అరూప) తృష్ణ, వంచన,
అస్థిరత్వం, అవిద్య)
ఐదింటిని భావించు
(శ్రద్ధ, స్మృతి, వీర్యం, ఏకాగ్రత, ప్రజ్ఞ)
ఐదింటినతిక్ర మించు
(రాగం, క్రోధం, అసూయ, అభిమానం, అసత్యభావన)
భిక్షువిలా జేస్తే
'ఓఘ తీర్ణు' డవుతాడు.
(సంసారం దాటుతాడు). 11

భిక్షు! ధ్యానించుము
ప్రమాదంలో పడవద్దు

భోగమను చక్రంలో
మనసును పడనీయకు
ఆదమరచి, వేడి ఇనుప
గుండును దిగ మింగ బోకు
కుయ్యోమొర్రో అంటూ
దుఃఖానికి కుందకు. 12

ప్రజ్ఞలేని వానికి ఏకాగ్రత లేదు
ఏకాగ్రత లేని వానికి ప్రజ్ఞే లేదు,
ఏకాగ్రత ప్రజ్ఞయు రెండూ కలవాడు
నిర్వాణం చేరతాడు, ఎంతైనా నిజం. 13

ఏ కాంత ప్రదేశంలో
సుప్రశాంత చిత్తుడై
సద్ధర్మం దర్శించు
సానందంగా భిక్షువు. 14

స్కంధాల పుట్టుక
స్కంధాల గిట్టుక
లోతులు అవగతమైన
ప్రీతిసౌఖ్యము కలుగు
ఆనందం ఉదయించు
అమృత ప్రాయంబుక
(రూపం matter, వేదన feelings,
సంజ్ఞ perceptions, సంస్కార traditional activities,
విజ్ఞాన consciousness ఇవి స్కంధాలు) 15

తెలివిగల భిక్షువు
కలిగియుండు నియమాలు

సంతుష్టి, నిగ్రహం
'పాతి మోక్ష' పు విధులు (మౌళిక ప్రబోధాలు)
శుద్ధజీవనమతన్వితత*గల (*అప్రమత్తత)
చెలుల చెలిమి చేయాలి. 16

ప్రవృత్తిలో సేవాదరణ
ప్రవర్తనలోకుశలత్వం
బ్రతుకు లోన ఆనందం కల్గి
అధిగమిస్తాడు దుఃఖాన్ని. 17

భిక్షువు లారా వది లేయండి — జేతవనం-
రాగద్వేష లంపటముల్ — 500భిక్షువులు
వసంతలత వాడిన పూలను
విదలించేసే విధముగను 18

శాంతమైన దేహం కలిగి — జేతవనం- శాన్తకాయుడు
శాంతమైన వాక్కుపొంది — (భిక్షువు)
శాంతమైన మనసు వుండి
చక్కని సమాధి స్థితిలో
లౌకిక విషయాలు వదిలే
భిక్షువు "ఉపశాన్తుడే"ను. 19

తనకు తానే నడుచు కుంటూ — జేతవనం- లజ్గాలుడు
తనకు తానే పనులు జేస్తూ — (భిక్షువు)
తనకు తానే రక్షణవుతూ
తెలివితో వర్తించు భిక్షువు
తృప్తి పొందును-సుఖంచెందును. 20

తనకు తానే నాథుడు
తనకు తానే సద్గతి
తనకు తానే రక్షణ
మనసు తన వశమైయుండు
వణిజుడశ్వము నణచినట్లు. 21

బుద్ధుని ఉపదేశంలోన
ఆమోదం, హర్షం కలిగి
ప్రసన్నముగ(తా)ఆచరించిన
సంస్కారాలు శమిస్తాయి
సుఖశాంతిపదవులొస్తాయి. 22

రాజగృహం (వేణువనం)-వక్కలి (భిక్షువు)

యువకుడుగా
బౌద్ధం పట్టిన
భిక్షువు వెలుగు
ఇస్తాడు
మేఘం నుంచి
బయటి కొచ్చిన
చంద్రునిలా
ఉంటాడు. 23

శ్రావస్తి (పూర్వారామం)-సుమనుడు (సామరేణుడు)



# 26. బ్రాహ్మణ వర్గం

బహుశ అర్హతుని గురించి చెప్పడానికి అందరికి తెలిసిన బ్రాహ్మణ శబ్దంవాడబడింది. పూజ-పౌరోహిత్యం- యజ్ఞయాగాలకు సంబంధించిన బ్రాహ్మణుల కర్మకాండ జ్యోతిష వ్రతశకున శరీరశోషణ విధానాలను బుద్ధుడు పూర్తిగా నిరసించాడు. మృదువుగా, సహేతుకంగా తిరస్కరించాడు. అన్యమతబోధకులను పరుషంగా నిందించలేదు. తప్పైన దాన్ని ఖండించిప్రకటించడం కన్నా ఒప్పైనదాన్ని ఆచరించి చూపించడం బుద్ధునివిధానంలోని మర్మం. ధర్మం, జ్ఞానం, సద్వర్తన గలవాణ్ణి మాత్రమే బ్రాహ్మణుడన వచ్చని చెప్పాడు.

జేతవనం- మిక్కిలి శ్రద్ధ గల బ్రాహ్మణుడు

పరాక్రమించుమ బ్రాహ్మణా
ప్రవాహాన్ని ఛేదించుమా
కామాన్ని కడిగి వేయుమా
సంస్కారాలు నశించునట్టివని (వస్తువులు, స్కంధాలు)
తెలిసికొనుమ తగ బ్రాహ్మణా
కృతకంగాని నిర్వాణాన్ని
గ్రహించువాడవు కమ్మా. 1

జేతవనం- పలువురు భిక్షువులు

రెండు ధర్మాల అంచులుచూడు
(అంతర్దృష్టి, ధ్యానములజాడు)
వాటి తీరమును చేరుము బ్రాహ్మణా
సర్వ బంధాలు తెగిపోతాయి. 2

జేతవనం-మారుడు

ఈ తీరం లేదాతీరం
(పంచేంద్రియాలు, విషయాలు)
ఇరుతీరాలు లేని వాణ్ణి
బాధ, బంధం లేని వాణ్ణి
బ్రాహ్మణు డంటాను నేను. 3

ధ్యాని శుద్ధుడు స్థిరుడు కృత్యుడు
దోషరహితుడు పరమ విజ్ఞుడు
బ్రాహ్మణు డంటానతనిని నేను.

జేతవనం- ఒకానొక బ్రాహ్మణుడు

4

పగలు సూర్యునిప్రకాశం
రాత్రి చంద్రుని ప్రకాశం
కవచం రాజుకు ప్రకాశం
ధ్యానమే బ్రాహ్మణ ప్రకాశం
బుద్ధుడో స్వీయతేజమున
పగలు రాత్రీ ప్రకాశించును.

శ్రావస్తి (పూర్వారామం)- ఆనందుడు (భిక్షువు)

5

పాపం కడిగేసు కొని
బ్రాహ్మణు డయ్యాడు
సమమైన చర్య వల్లే
శ్రమణుండయ్యాడు
మలినాలు తొలగ-ప్ర
వ్రజితుడయ్యాడు.

జేతవనం- ఒకానొక సన్యాసి

6

కొట్టరాదు బ్రాహ్మణుని
కోపగించరాదతనిని
కొట్టడము నింద్యము
కోపగించడము నింద్యం.

జేతవనం సారిపుత్తుడు (భిక్షువు)

7

ఉత్తమ బ్రాహ్మణుని శ్రేయ
మెంత మాత్రమూ తరుగదు
ప్రియమైన వాటినుంచి
మనస్సు మరల్చిన కొద్ది
హింసాత్మక చర్యనుంచి
మనసు తొలిగిన కొద్ది
దుఃఖముపశమిస్తుంది.

8

దేహం, వాక్కు, మనసుల ద్వారా
చెడును చేయని వాణ్ణి
త్రికరణములపై అదుపుగల వాణ్ణి
బ్రాహ్మణుండంటాను నేను.

జేతవనం- మహా
పజాపతి గోతమి

9

ఎవని నుండి సద్ధర్మం తెలియునో
వానికి నమస్కరించాలి
వానిని సమాదరించాలి
భక్తితొ బ్రాహ్మణుడగ్ని హోత్రునకు
నమస్కరించే చందాన.

జేతవనం-సారిపుత్తుడు
(భిక్షువు)

10

జుట్టుముడి వల్ల, గోత్రం వల్ల
పుట్టుక వల్ల బ్రాహ్మణుడుకాడు
సత్యం-ధర్మం-పవిత్రత
గలవాడే అగు బ్రాహ్మణుడు.

జేతవనం- జటిలుడగు
బ్రాహ్మణుడు

11

తెలివి హీనుడా! జడలున్నా,
జింకచర్మము ధరించినా
ఏమి లాభము-ఏమిలాభము
లోన మలినాలు పెట్టు కొని
బయట శుభ్రము చేస్తావేమి?

వైశాలి (కూటాగారశాల)-
పాఖండుడగు నొక
బ్రాహ్మణుడు

12

చినిగిన బట్టలు ధరించు వానిని
సన్నగ, బక్కగ చిక్కిన వానిని
వనమున ఒంటిగ ఉండే వానిని
ఏకాంతుని, ధ్యానించు వానిని
బ్రాహ్మణుడని నే నంటాను.

రాజగృహం (గృధ్రకూటము)-
కిసాగోతమి

13

యోని నుండి పుట్టిన మాత్రాన
బ్రాహ్మణికి పుట్టి నంత మాత్రాన

జేతవనం- ఒకానొక
బ్రాహ్మణుడు.

బ్రాహ్మణుడని నేననలేను
పేరుకు బ్రాహ్మణుడైనాను,
పుచ్చుకుంటె బాపనయ్యకాదు
పుచ్చు కోక, ఇచ్చు లేక మెలిగిన
బ్రాహ్మణుడనినే నంటాను. 14

బంధా లేవీ లేనివాడు
జంకు కొంకు లేనివాడు
సంగమాలు లేనివాడు
ఆసక్తియును లేనివాడు
బ్రాహ్మణు డంటాను నేను. 15

రాజగృహం (వేణువనం)-
ఉగ్గసేనుడు (శ్రేష్ఠిపుత్రుడు)

ద్వేషమనేతాడును తెంచి
తృష్ణయనే పగ్గం విరిచి
మతఛాందస మోకును కోసి
లోలోని వ్యసనాల్ దునిమి
అజ్ఞానపు పొరలు తెంచుకొని
బోధిని పొందిన వాడెవడో
బ్రాహ్మణుడని నేనంటాను 16

జేతవనం- ఇరువురు
బ్రాహ్మణులు

నిందలు,దెబ్బలు, శిక్షలు పడినా
కుందక, ఆక్రోశించక ఉంటే
క్షమాశక్తి బాగ కలిగుంటే
బ్రాహ్మణు డనినేనంటాను. 17

రాజగృహం (వేణువనం)-
(అక్కోన) భారద్వాజుడు

కోపం లేనివాడెవడో
కర్తవ్యం కలవాడెవడో
శీలవంతుడు శాస్త్ర పాఠకుడు
తనపై అదుపు గలవాడు

రాజగృహం (వేణువనం)
సారిపుత్తుడు (భిక్షువు)

అంతి మదేహం కలవాడు
వానిని బ్రాహ్మణుంటాను. 18

తామరాకు పై తడిలాగ
సూదిమొనపైన గాజువలె
కామం అంటని వాడెవడో
బ్రాహ్మణు డంటానేనతని. 19

రాజగృహం (వేణువనం)-
ఉప్పవణ్ణ (భిక్షురాలు)

ఇప్పుడు, ఇక్కడ దుఃఖంపోయి
భారంనుండి బయట పడినచో
బ్రాహ్మణు డంటానేనతని. 20

జేతవనం-
ఒకానొక బ్రాహ్మణస్త్రీ

మనోప్రజ్ఞతో నున్న వాడ్ని
మేధా సంపద గలవాడ్ని
మార్గామార్గ మెరిగిన వాడ్ని
మేటి లక్ష్యార్థ మరసిన వాడ్ని
బ్రాహ్మణుడంటాను నేను. 21

రాజగృహం (గృధకూటమి)-
ఖేమ (భిక్షురాలు)

గృహ పతులకును సన్యాసులకు
అంటీ అంటక ఉండేవాడు
తనకంటూ ఒకఇల్లు వాకిలి
లేకుండా విహరించేవాడు
ఇచ్ఛ ఉచ్చుల చిక్కని వాడు
బ్రాహ్మణు డంటా నేనతని. 22

జేతవనం (పబ్భార వాసి)-
తిస్సుడు (భిక్షువు)

కదిలే జీవుల, కదలని జీవుల
ఏమాత్రం దండించనివాడు
తనకై తాను చంపని వాడు
ఇతరులతో చంపించని వాడు
బ్రాహ్మణుడంటా నేనతని. 23

జేతవనం- ఒకానొక భిక్షువు

చుట్టూ విరోధులున్నప్పటికి
మైత్రిగ తాను మెలిగే వాడు
డండించు వారి మధ్య మున్నను
శాంత చిత్తమున నుండేవాడు
సంగ్రహబుద్ధి కలవారున్నా
సంగ్రహించక ఉండేవాడు
బ్రాహ్మణు డంటానేనతని. 24

జేతవనం- నలుగురు శ్రామణేరులు

ఆవగింజలు పడిపోతాయి
సూదిమొన పైన నుండి
రాగం, ద్వేషం, మానం, వైరం
ఎవని నుండి విడిపోతాయో
వానిని బ్రాహ్మణుడంటాను. 25

రాజగృహం- (వేణువనం)-మహా పన్థకుడు (భిక్షువు)

సౌమ్యంగ, విన్నపంగ
ఉదారంగ ఉండు వాడు
సత్యాన్ని పలుకువాడు
కష్టం పెట్టనివాడు
బ్రాహ్మణుడని నేనంటా. 26

రాజగృహం- (వేణువనం)- పిలిన్ద వచ్ఛుడు (భిక్షువు)

పొట్టిదైన - పొడవుదైన
చిన్నదైన - పెద్దదైన
మంచిదైన- చెడ్డదైన
తనికివ్వని దేనినైన
తీసికొనని వాడిని
బ్రాహ్మణు డంటానునేను. 27

జేతవనం- ఒకానొక వృద్ధుడు

ఏ లోకపు విషయానికి
ఆశపడని వాడు

జేతవనం- సారి పుత్తుడు (భిక్షువు)

ఆశలు లేనివాడు
అనాసక్త మయుడు
బ్రాహ్మణుడనబడతాడు. 28

వాంఛలు విడిచిన వాడు
జ్ఞానంతో అనుమానం
తీర్చేసు కొన్నవాడు
ఉత్తమా మృతంబును
పొందగల్గిన వాడు
అతడే బ్రాహ్మణుడు. 29

జేతవనం- మహా మొగ్గ లానుడు (భిక్షువు)

పుణ్యాలు పాపాలు
తెంచేసుకున్నవాడు
సంగమాన ఆసక్తిని
విడిచి పెట్టిన వాడు
దుఃఖ లేశము లేక
మచ్చ పడని వాడు
చిత్త శుద్ధి పవిత్రత
పొంద కల్గిన వాడు
బ్రాహ్మణుడు అవుతాడు. 30

శ్రావస్తి (పూర్వారామం)- రేవతుడు (భిక్షువు)

చంద్రునికున్నట్లు మచ్చలేని వాడు
శుద్ధుడు, శాంతుడు, మలిన రహితుడు
మూల తృష్ణ నడగించిన వాడు
బ్రాహ్మణుడని నేనంటాను. 31

జేతవనం - చన్దాభుడు (భిక్షువు)

అతికష్టమైన మార్గాన్ని
సంసార చక్ర బంధాన్ని
మోహావేశపు తీరాన్ని

కుండియా (కోలియా)- సీవలి (భిక్షువు)

ఎవడుదాటిపోగల్గుతాడో
ఎవడు ధ్యానమయు డవుతాడో
ఎవడు దేనికీ అంటకుండునో
నిర్వాణంపైఎవడు మొగ్గునో
వానిని బ్రాహ్మణుడంటాను. 32

ఎవడు ఇంద్రియానందం వదలునో
ఎవడు ఇల్లువదలి సన్యసించునో
ఎవడు భవము క్షయింప జేయునో
(రూపం-భావం-రూప రహితము)
వానిని బ్రాహ్మణుడంటా నేను. 33

జేతవనం- సున్దర సముద్దుడు (భిక్షువు)

ఎవడు తృష్ణను తుంచేస్తాడో
ఎవడు ఇల్లువదలి సన్యసించునో
ఎవడు తృష్ణ-భవమడంగిస్తాడో
వానిని బ్రాహ్మణుడంటా నేను. 34

రాజ గృహం (వేణువనం)- జటిలుడు (భిక్షువు)

ఎవడు మానుష బంధాలను
ఎవడుదైవిక సంబంధాలను
ఎవడన్నిరకాల ఉచ్చులను
అధిగమించునో-తెంచి వేయునో
వానిని బ్రాహ్మణుడంటాను. 35

రాజగృహం (వేణువనం)- ఒకానొక భిక్షువు)

ఇష్టా యిష్టాల్ వదలిన వాడు
పైత్యా లొదిలిన చల్లనివాడు
లోకంజయించు వీర్య వంతుడు
బ్రాహ్మణుడని నేనంటాను. 36

జీవుల జన్మల పునర్జన్మలను
ఎవడు బాగుగ ఎరిగినవాడో

రాజగృహం(వేణువనం)- వజ్జీసుడు (భిక్షువు)

ఎవడు దేనిని అంటనివాడో
ఎవడు సుగతుడో జ్ఞానవంతుడో
వానిని బ్రాహ్మణుడంటాను. 37

ఎవని మార్గము అగోచరంబో
దేవ గంధర్వ మనుష లెరుగరో
ఎవనికి దుఃఖాలంతరించునో
ఎవనికి అర్హత పదవిలభించునో
వానిని బ్రాహ్మణుడంటా నేను. 38

రాజగృహం (వేణువన్యం)- ధమ్మదిన్న (భిక్షురాలు)

ఎననికి భూత భవిష్యత్ పట్ల
వర్తమాన స్కంధాలపట్లను
ఆశలేదో, ఆసక్తియు లేదో
ఎవడుదేనికి కట్టుబడకనూ
ఎవడు దేనినీ గ్రహించకుండునో
వానిని బ్రాహ్మణు డంటాను. 39

జేతవనం- అఙ్గులి మాలుడు (భిక్షువు)

శుద్ధుడు, వీరుడు, ప్రవరుడు,
శ్రేష్ఠుడు, ఋషి, విజేత
సుస్థిరుడు, బుద్ధుడు
అయిన వానిని నేను
బ్రాహ్మణు డంటాను. 40

జేతవనం- దేవహితుడు (బ్రాహ్మణుడు)

పూర్వ నివాసం తెలిసిన వాడు
స్వర్గనరకాలు చూచిన వాడు
జన్మాంతాలకు చేరిన వాడు
అభిజ్ఞానమును పొందిన వాడు
మునిగా మనుగడ చేసిన వాడు
అన్నిట పూర్ణత గాంచిన వాడు

బ్రాహ్మణుడని నేనంటాను.

(అభిజ్ఞానం = బోధి)

ఎవరికి వారే వెలుగైనట్లు
నీవుండూ నీవుండు
ఎవరికి వారే శరణమైనట్లు
నీవుండూ, నీవుండు
బయట దేనికీ శరణు జొచ్చక
నీవుండూ, నీవుండు
సత్యం శరణని గట్టిగ బట్టి
నీవుండూ, నీవుండు. 41



## ఆధార గ్రంథాలు

1. ధర్మపదము - (పాళి, సంస్కృతము)- బ్రహ్మచారి ఆనందమోహన్, అనువాదం : శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు, 1949.
2. Dhammapada - Narada Maha Thera translation, A.P. Police Academy, Hyderabad, 1990.
3. Dhammapada - Dr. C . Kunhan Raja, The Theosophical publishing House, Madras, 1956.
4. ధమ్మపదం - గజ్జెలమల్లారెడ్డి అనువాదం, ఆనంద బుద్ధవిహార్, సికింద్రాబాద్, 1996.

మరియు కొన్ని ఇతర గ్రంథములు.

# మంగళ సుత్తము

## (మహామంగళం-ఉత్తమాశీస్సు)

నేను వింటిని ఈ విధమ్మున -
ఒక్కనాడు బుద్ధదేవుడు
శ్రావస్తినగరమందు -అ
నాథపిండకు డిచ్చినట్టి
జేతవన ఆరామ మందున
శాంతమై విహారించు చుండె
రాత్రి మించిన సమయమందు
కాంతితో దేవతా మూర్తి
జేతవనమున ప్రవేశించి
ప్రకాశించి సమీపించి
బుద్ధునికి అభివాద మిడి (తా)
వినయమున ప్రక్కగా నిలబడె,
అటుల నిలబడి తథాగతునితో
ఇటుల పలికెను గాథ రూపున:

1. చాలమంది దేవ మనుజులు
మంగళమ్మనలేమిటా యని
తెలిసికోనున్నారు చెప్పుమ
ఏది ఉత్తమ మంగళం?

2. మూర్ఖులను సేవింపకుండుట
పండితుల సేవించుచుండుట
పూజనీయుని పూజసేయుట
ఇది యె ఉత్తమ మంగళం.

3. సాను కూల స్థలము నుండుట
సత్య కర్మలు చేసి యుండుట
చక్కని సంకల్ప ముండుట
ఇదియె ఉత్తమ మంగళం.

4. బహుళ జ్ఞానం పూర్ణనమ్రత
మనో శిక్షణ వినయశీలత
మేలు జేయు మృదుల భాషణ
ఇదియె ఉత్తమ మంగళం.

5. తల్లి తండ్రుల సేవ జేయుట
దార సుతులను బాగ జూచుట